రులో భూసంస్కరణలను ప్రవేశ పెట్టారు. దేశంలో వివిధ రాజకీయ పార్టీలు తమ అభిప్రాయాలను తెలియజేస్తున్నాయి ఇదివరకూ సుబ్రమణ్యం కమిటీ రిపోర్టు ఉంది. అదే విధంగా కుమారప్ప కమిటీ రిపోర్టుకూడా ఉంది. ప్లానింగు కమిటీ సూచన లున్నవి ఇవన్నీ అమూల్యమైనవికావా? ఈ సూచనలను అనుసరించి మేము భూసంస్కరణలు చేస్తామని ఎందుకు చెప్పకూడదు? అంటే భూసంస్కరణలను ప్రవేశపెట్టము అని చెప్పేదానికంటే ఈ మాటలకు వేరే ఏమి అర్థం లేదు. ఇపుడు కౌలువారీ ఆర్డినెన్సును కూడా ప్రవేశ పెట్టినారు. ఈ కౌలుదారి ordinance కూడా ప్లానింగు కమిటీ సూచన ప్రకారం పెట్టారా? కౌలుకు భూములిచ్చు విషయములో భూస్వాములు, మామూలు మధ్యతరగతి రైతులు, పేదరైతులు కౌళ్లకిచ్చునప్పుడు విచక్షణ చూపించాలని సుబ్బారావు కమిటీవారు ప్లానింగు కమిషన్ సిఫార్సులను చేశారు. కాని ప్రభుత్వం ఇపుడు తీసుకొచ్చిన ఆర్డినెన్సులో గానీ భూస్వాములు, పేదరైతులు మున్నగువారి విషయమై విచక్షణకూడా తీసుకొనిరాలేదు. కౌలుదారులకు కావలసినటువంటి హక్కును న్యాయమైనటువంటి కౌళ్లను నిర్ణయించడానికి ప్రభుత్వానికి ఉద్దేశంలేదు. సుబ్బారావు కమిటీవారి సిఫార్సుల ప్రకారం 50 పరిసెంటు లేక 45% యేర్పాటు చేస్తామని చెపుతున్నారు. స్పష్టంగా ప్లానింగు, ప్లానింగు కమిషనువారి సిఫార్సులున్నప్పటికీ భూస్వాముల మధ్యతరగతి రైతుల విచక్షణ చూపడానికి ప్రభుత్వం పూనుకొనడంలేదు. భూసంస్కరణలు చేస్తే పంట తగ్గిపోతుం దంటున్నారు. ప్రపంచంలో భూసంస్కరణలను అమలుజరుపనటువంటి దేశం లేదు. భూసంస్కరణలను జరిపిన అన్నిదేశాలతోనూ వెంటనే అమలు జరిపి ప్రజలందరకూ భూములనిచ్చి ఉత్సాహపరచి ఎక్కువ పండించారు. కాని మన ప్రభుత్వం భూసంస్కరణలు జరిపితే పంట తగ్గిపోతుందని చెపుతున్నది.

నెల్లూరు జిల్లాలలోనే పదివేలమందిని బంజరు భూములనుండి వెళ్లగొట్టడానికి ప్రభుత్వ సూచనల ప్రకారం స్థానిక ఉద్యోగులు ప్రయత్నాలు చేస్తున్నారు. దండోరాలు వేయిస్తున్నారు. నోటీసులు ఇస్తున్నారు. పంట తగ్గిపోతుంది, పంట తగ్గిపోతుంది. అని మాటకు చెప్పే ఈ ప్రభుత్వం ఈ 10 వేల ఎకరాలలో సంవత్సరానికి పదివేల పుట్ల ధాన్యాన్ని 15-20 సంవత్సరాలనుండి పండిస్తున్న పేదరైతులను వెళ్లగొట్టుటకు నోటీసు యివ్వవలసిన అవసరం ఏమి కల్గింది? ఈ డెల్టా ఏరియాలోని చెరువుగర్భం భూములు సాగుచేస్తే నష్టమేమిటి? ప్రభుత్వమునకు మార్చిలోనే, కాంగ్రెసుపార్టీ, కమ్యూనిస్టు

పార్టీ, సోషలిస్టుపార్టీ, ప్రజా సోషలిస్టుపార్టీ నెల్లూరు జిల్లాకు సంబంధించినటు వంటి అన్ని పార్టీల వాళ్లుకూడా ఈ చెరువు బంజర్లనుండి ఎవిక్షన్ చేయవద్దని అర్జీ ప్రభుత్వానికి అందచేశారు కొన్ని చెరువులలో నీరు ఉంటే ఆ నీటివల్ల భూములు మునిగి తక్కిన రైతాంగానికి పంటలు పాడయి నష్టపడుతారు. కావున కొన్ని చెరువులను ఎత్తివేయమని ప్రభుత్వం సిఫారసు చేసియున్నది. ఈ చెరువులలోనే కొంతమంది రాజకీయ బాధితులకు పట్టాలు ఇచ్చారు. ఈ చెరువుల్లోనే ఇంతవరకూ సాగుచేస్తున్న కూలీలందరికికూడా temporary గా ఇదివరకే పట్టాల నిచ్చింది. అటువంటిప్పుడు వాళ్లందరినీ ఎవిక్షన్ చేయవలసిన అవుసరం ఏమి వచ్చింది? పంటవిషయంలో 'అయ్యో ఇంత పంట తగ్గిపోతుందే' అనేటటువంటి ప్రభుత్వం వీరిని ఎందుకు వెళ్లగొట్టాలి? దేశంలో మనకు పండే పంటలు సరిపోవడంలేదు. 15–20 సంవత్సరాలనుంచి పొలాలను బాగుచేసుకొని శ్రమపడి సాగుచేసుకొంటూ ఉండేటటువంటి కూలీలను పేదరైతాంగాన్ని ఈ భూములనుంచి వెళ్లగొట్టాల్సిన అవు సరమేముంది? ఈ eviction విధానాన్ని గనుక అక్కడ తక్షణం ఆపువేయకపోతే మొత్తం రెండు తాలుకాల్లో 10 వేల కుటుంబాలకు అన్యాయాలు జరుగబో తున్నాయి అంతేకాదు. ఇంకా అక్కడక్కడ భూస్వాములు పేదలకు భూములు లేకుండా చేయడాన్కి ప్రయత్నిస్తున్నారు ప్రభుత్వం అక్కడ భూస్వాములకు అం డగా నిలబడి పేదరైతాంగాన్కి అన్యాయంచేసే ఉదాహరణలను ప్రభుత్వ దృష్టికి లక్షలు తీసుకొని వచ్చాం వాటంచేడులో మూడువందల ఎకరాలకు సంబంధించినటు వంటి సమస్యను ఇప్పుడు ముఖ్యమంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. ఇది వారికి స్వయంగా తెలిసినటువంటి విషయం. సొసైటి స్థాపించుకొన్న పేదలకు భూములను ఇవ్వక ఒకే భూస్వామికి అక్రమంగా ఆ భూములను ప్రభుత్వం లీజుకు యిచ్చినది చెరువు బంజర్లు సాగుచేసే పేదలకు temporary పట్టాలున్నాయి. టాంకుబెడ్సులో కొంతమంది రాజకీయ బాధితులకు పూర్తి పట్టాలనిచ్చినారు ఈ విధంగా 15–20 సంవత్సరాల నుండి భూములను సాగుచేస్తున్న వారిని ప్రభుత్వం అనుమతించి ప్రోత్స హించింది. అటువంటి భూములనుంచి బీదలను వెళ్లగొట్టవద్దని నెల్లూరు జిల్లాకు సంబంధించిన అన్ని రాజకీయ పక్షాలవారు ప్రభుత్వానికి మెమోరాండం ఇచ్చారు. ఒక్కొక్క చెరువునుగూర్చి వివరంగా తెలియజేశాము వివరంగా పరిశీ లింప జేస్తామన్నారు. ఇంతమట్టుకు కలెక్టరుగానీ P W. D. వారుగానీ ఒక చెరు వును అయినా పరిశీలించలేదు. పరిశీలించకుండానే ప్రభుత్వంవారి general order

ఉందికాబట్టి పరిశీలించాల్సిన అవసరం లేదని మళ్లీ ఈ Eviction Notice లను ఇస్తున్నారు వేసిన పైరును పీకివేస్తామంటున్నారు. ఇది న్యాయమా? ఈ వ్యవసాయ కూలీలకు గాక, భూస్వాములకు 15-20 సంవత్సరములనుండి పంటల నెక్కువచేసినటువంటి వారికి అన్యాయం చేయడం న్యాయమా? అందువల్ల వానిని ఇప్పటికైనా ఉపసంహరించుకోవాలని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri A SATYANARAYANA MURTY అధ్యక్షా! నిన్న గవర్నరుగారు యిచ్చిన ఉపన్యాసమును సమర్థిస్తూ, కొన్ని సూచనలను ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. గత 5 సం॥లుగా మొదటి పంచవర్ష ప్రణాళికకు 60 లక్షల రూపాయలు ఖర్చుపెట్టినారు దానికి ప్రజలంతా సహాయపడి ఆ స్కీమును నిర్విఘ్నంగా నడిపించారు. ఇప్పుడు రెండవ పంచవర్ష ప్రణాళికలో 120 కోట్ల రూపాయలను మనం ఖర్చుపెట్ట బోతున్నాము. దీనికి ప్రభుత్వోద్యోగస్థులు, ప్రజలు వారి పూర్తి సహకారాన్నివ్వాలి. ఈ విషయంలో ప్రజల సహకారం పొందగలమనే నమ్మకం వుంది. మన దేశంలో ఆహారోత్పత్తి చాలినంతగాలేదు జనాభా పెరుగుతోంది. ఇతర దేశాలనుంచి మనకు కావలసిన ఆహార పదార్థములను దిగుమతి చేసుకోడానికి కేంద్ర ప్రభుత్వం 150 కోట్ల రూపాయలు ఖర్చుచేస్తోంది. ఈ లోటును పూర్తిచేయడానికి మనం గట్టిగా కృషి చేయాలి.

అందుకుగాను మన resoruces నన్నింటినీ ఉపయోగించి తగిన పథకములను తయారుచేసుకోవాలి. ప్రతీ జిల్లాకు ఏదో విధమైన అభివృద్ధి ప్రణాళికలున్నట్లు గవర్నరుగారి ఉపన్యాసంవలన తెలుస్తోంది. శ్రీకాకుళం, జిల్లాకు వంశధార, నెల్లూరు, గుంటూరు కృష్ణా జిల్లాలకు నాగార్జునసాగర్ ప్రాజెక్టు రాయలసీమ ప్రాంతానికి తుంగభద్ర, హైలెవల్ కెనాల్ మొదలయినవన్నీ వున్నాయి. ఇంతవరకు తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలకు ఉపయోగపడే ప్రణాళికలు లేవు. కొంత మొత్తము ఖర్చు పెట్టడానికి నిర్ణయించారు. కాని ప్రతి సంవత్సరం ఎర్ర కాలవ పొంగడం మూలంగా చాలా నష్టం కల్గుతోంది కాని ఏమీ అమలు వరచే సూచనలు కనబడుట లేదు. గోదావరి జిల్లాలలోని ప్రజలు చాలా భాగ్యవంతులు. వారు సుఖంగా అనుభవిస్తున్నారనే అభిప్రాయం ప్రభుత్వానికి వున్నది. అందుకు నేనూ ఒప్పుకుంటాను. అయితే మేముకూడా ప్రభుత్వానికి పన్నులను చెల్లిస్తున్నామనే సంగతి జ్ఞాపకముంచుకోవాలి. మామూలు పన్నే కాకుండా హెచ్చు చేసిన పన్నుకూడా ఇస్తున్నాం.

శబరి నదికి ఒక ప్రాజెక్టు కట్టినట్లయితే గోదావరి జిల్లాల ప్రజలకు చాలా లాభాలు కల్గుతాయి. సుమారు 10 లక్షల ఎకరముల భూమి రెండవ పంట సాగు చేసుకోడానికి వీలవుతుంది. దాని విషయమై ప్రభుత్వంవారు ఇంతవరకు ఆలోచించుట లేదు. ఈ ప్రాజెక్టును నిర్మించడానికి 10, 12 కోట్ల రూపాయలుకంటె ఎక్కువ ఖర్చు కాదు. దీనికి ప్రజలు సహాయపడతారు. ఈ విషయాన్ని నేను గత బడ్జెట్ సమావేశంలో చెప్పియున్నాను. ఈ ప్రాజెక్టువల్ల సాగయ్యే 10 లక్షలు ఎకరముల మీద ఎకరానికి ఒక బస్తా చొప్పున 5 సంవత్సరములు వసూలుచేస్తే 7, 8 కోట్ల రూపాయలు వసూలు అవుతాయి. ఓగతా మొత్తం రాష్ట్ర ప్రభుత్వంగాని, కేంద్ర ప్రభుత్వంగాని ఖర్చుపెట్టినట్లయితే పని జరుగుతుంది. అందుకు మేము సిద్ధంగా ఉన్నామని, మా జిల్లా ప్రజల తరఫున నేను హామీ ఇస్తున్నాను. మిగిలిన ప్రాజెక్టులు ఏవి కట్టినప్పటికీ కట్టిన 2, 3 సం॥లకుగాని ప్రభుత్వానికి ఆదాయం రాదు. శబరి ప్రాజెక్టు నిర్మించినట్లయితే మలి సంవత్సరంనుంచీ కూడా ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది. అది already established area కనుక, క్రొత్తగా కాల్వలను త్రవ్వనక్కరలేదు. అట్టి ఖర్చు వుండదు. రెండవ పంటనుంచి పన్నుల రూపంలో ప్రభుత్వానికి ఆదాయం వస్తుంది. అంతే కాకుండా భద్రాచలం ప్రాంతంలోని 75 వేల ఎకరాల భూమి క్రొత్తగా సాగు లోనికి రావడానికి వీలుంది.

ఈ ప్రాజెక్టు విషయంలో కొంత సహాయం చేయమని కేంద్ర ప్రభుత్వాన్ని మనం కోరాలి. ప్రజలు దీనికి సహాయపడతారు. కనుక ఈ విషయంలో మంత్రి గారు శ్రద్ధ వహించాలని కోరుచున్నాను.

ఇచ్చంపల్లి డాము నిర్మించడం చాలా అవసరం. ప్రభుత్వం ఇంత కాలం నుంచీ దీనిని అసలు దృష్టిలోకి తీసుకొనుటలేదు. ఈ డాము నిర్మాణంవల్ల ఆ నీరు కృష్ణలోపడి కృష్ణానదినుంచి పెన్నారులోనూ, అచ్చటనుంచి మద్రాసువరకు వెళ్లుటకు అవకాశం వుంది. నాగార్జునసాగర్ నిర్మించినప్పటికిన్నీ, నెల్లూరు, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని కొన్ని భూములు సాగులోకి రావు. 32 లక్షల ఎకరాలు సాగులోకి వచ్చిననూ, యింకా కొంత dry area మిగిలిపోతుంది. గోదావరి నీటిని ఈ విధంగా divert చేసినట్లయితే నాగార్జునసాగర్‌వల్ల సాగులోనికి రాని భూమిని సాగులోకి తీసుకురావడానికి అవకాశం వుంటుంది. కొంత విద్యుచ్ఛక్తి కూడా లభ్యమవుతుంది. ఈ విద్యుచ్ఛక్తివలన ఆ ప్రాంతంలోగల ఇనుప గనులు, బొగ్గు

పరిశ్రమలను అభివృద్ధిచేసి సరఫరా చేయడానికి అవకాశం వుంటుంది. శబరి ప్రాజెక్టు నిర్మాణంవల్ల మెట్టు, గుట్టు అనే రెండు గ్రామాలు మునిగిపోతాయి. ఇప్పుడు తుంగభద్రగాని, నాగార్జునసాగర్‌గాని, శ్రీకాకుళంలోని వంశధారకాని ఏది నిర్మించినప్పటికీ కూడా కొన్ని గ్రామాలు మునిగిపోక తప్పదు. అందుకు ఆ గ్రామాలవారికి ప్రభుత్వం Compensation ఇస్తుంది. ఆ రెండు చిన్న గ్రామాలవారికి Compensation ఇవ్వడానికి మేము సిద్ధంగా వున్నాము. ఈ రెండు గ్రామాల విషయంలో పెద్దగా ఆలోచించవలసిన అవసరంలేదు వంశధార విషయంలో అంగీకరించినట్లుగానే ఈ శబరి ప్రాజెక్టు నిర్మాణం విషయంలో కూడా ఒరిస్సా ప్రభుత్వం తప్పకుండా అంగీకరిస్తుందని నా నమ్మకం. దీని విషయమై ప్రభుత్వంవారు శ్రద్ధగా పనిచేయాలని కోరుతున్నాను. ఇచ్చంపల్లి డాము నిర్మాణం విషయంకూడా కేంద్ర ప్రభుత్వ దృష్టికి తీసుకురావాలని మనవి చేస్తున్నాను.

Land Reforms Bill యింతవరకు అమలులోకి రాలేదని మన ప్రతి పక్ష సభ్యులకు చాలా కష్టంగా వుంది. వారితో ఈ విషయంలో నేను ఏకీభవిస్తున్నాను. Land Reforms Bill రాకపోవడం మంచిదని కొంతమంది అనుకొంటున్నారు. కాని వెంటనే అమలు జరపకపోయినట్లయితే చాలా ఇబ్బందులు కల్గుతాయని నేను అభిప్రాయపడుతున్నాను. మనం ఇప్పుడు తెలంగాణా రాష్ట్రంతో కలుస్తున్నాము. అక్కడ యీ సంస్కరణలు ఇదివరకే అమలులోకి వచ్చాయి. ఈ రెండు రాష్ట్రాలు కలిసి ఏక రాష్ట్రంగా పరిపాలింపబడుతుంది. అప్పుడు కొంత భాగంలో ఒక విధంగానూ, మరికొంత భాగంలో ఇంకో విధంగానూ ఉంచే చాలా ఇబ్బందులు కల్గుతాయి.

రైతులు కూడా ఈ భూ సంస్కరణల విషయమై చాలా ఆందోళన పడుచున్నారు. అందుచేత వెంటనే అమలు చేసినట్లయితే ఏమీ యిబ్బందులు ఉండవు.

ఇండియా మొత్తంమీద Socialistic pattern of Society అని ఒక నినాదం వున్నది. ఈ లక్ష్య సాధనకు కేంద్ర ప్రభుత్వం కృషిచేస్తోంది. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా సహాయం చేస్తున్నాయి. ఈ పరిస్థితులలో ఈనాందారులకు చాలా భయంగా వుంది. మన దగ్గర ఎంత భూమి తీసుకొంటారు మనకు ఎంత భూమి మిగుల్చుతారు? మొత్తం అంతా తీసేసుకుంటారా అని భయపడుతున్నారు. "ఆలస్యం అమృతం విషం" అన్నట్లుగా యివి వెంటనే అమలు పరచకపోతే అసలే భూమి లేకుండా

పోషించేమోననే భయంగావుంది భూస్వాములకు రక్షణ యివ్వడానికికూడా కొన్ని క్లాజులున్నాయి యింతకాలంలో ఇంత భూమికంటె ఎక్కువ భూమి ఉండకూడదని నిర్ణయించినట్లయితే కొంతమంది కొంత పొలాన్ని అమ్ముకుంటారు. గాన ఉన్న భూమినంతా కూడా అమ్ముకొని బాధపడకుండా వెంటనే ఈ సంస్కరణలను అమలు జరిపాలని నేను కోరుతున్నాను.

Labour wages ను పెంచాలనీ, limit చేయాలని ఈ సభలో చర్చలు జరుగుతూనే ఉన్నాయి. Labour wages పెంచాలని ఒక ప్రక్కన అంటూ ధరలు తగ్గాలంటున్నారు Wages నిర్ణయం చేసినప్పుడు ధరలుకూడా నిర్ణయం కావాలి ధర నిర్ణయం కాకపోతే ఎక్కువగా ఉత్పత్తి చేయడానికి అవకాశం ఉండదు. ఉత్పత్తి చేసిన సరుకు బజారుకుపోయిన తరువాత ధర నిర్ణయం ఉండడం చాలా అవసరం. ఈ Labour, Production, Business అనే మూడింటికి అవినాభావసంబంధంవున్నది అందుచేత ఈ మూడింటిని ఒక విధంగా అమలు చేయాలనీ, ఒకటి నిర్ణయించి మిగతా రెండు నిర్ణయించకపోతే ప్రయోజనం వుండదుకాబట్టి ప్రభుత్వంవారు దీనిని గురించి శ్రద్ధగా ఆలోచించి చేయాలని కోరుతున్నాను.

Sales Tax విషయంలో ఒక బిల్లు రాబోతుంది. దానిని గూర్చి బిల్లు వచ్చినప్పుడు సవిస్తరంగా మాట్లాడతాను అందులో కొన్ని clauses చాలా కఠినంగా ఉన్నాయి. వాటిని గురించి నేను విపులంగా మాట్లాడదలచుకున్నాను.

మనం ప్రజలమీద అనేక రకాలైన పన్నులు విధిస్తున్నాము ప్రజలు illegal గా ధనార్జన చేయవద్దని legal గా ధనార్జన చేసుకోమని మనం ప్రజలకు చెప్పవలసియున్నది. సంపాదించిన ధనంలో ప్రభుత్వం వాటా ప్రభుత్వానికి యివ్వమనికూడా చెప్పాలి. ప్రజలయొక్క Civil Liberty కి యిబ్బంది లేకుండా వారి safety విషయంలో ప్రభుత్వంవారు తగినంత శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను.

Sri PRAGADA KOTIAH ఉపాధ్యక్షా, మన గవర్నరుగారు చాల ఓపికతోటి పెద్ద ఉపన్యాసము చేశారు. అందుకు వారిని నేను అభినందిస్తున్నాను. మన ప్రభుత్వము కూడా బహు ముఖంగా అభివృద్ధిని సాధించడానికి ప్రయత్నము చేస్తుంది. అందుకు ప్రభుత్వాన్ని కూడా అభినందించవలసినదే. కాని ప్రధానంగా పాటకపు జనంలో కొంత తీవ్రమైనటువంటి అసంతృప్తి ఉన్నది. దానిని ప్రభుత్వము

గమనించాలి ఇంతకుముందు సత్యనారాయణగారు మాట్లాడుతూ భూసంస్కరణలు త్వరపడి లేవడం మంచిదికాదేమోనని సలహా చెప్పారు. కాని గత ఎన్నికలలో మనమందరము కలసి చేసిన ప్రసంగాలన్నింటిని గుర్తుకు తెచ్చుకొంటే మనం ముందుకు వెడుతున్నామో లేక ఉన్నచోటనే ఉన్నామో స్పష్టంగా బోధపడు తుంది, ప్రసంగాలు చేసేటప్పుడు ఎంత ఉత్సాహంగా, ఆవేశంగా మాట్లాడడానికి పూనుకొంటున్నామో పని చేసేటప్పుడు అంత ఉత్సాహము, అంత ఆవేశము, ఆసక్తి ప్రదర్శించ వలసినటువంటి ఆవశ్యకత ఏ పార్టీ ప్రభుత్వానికైనా ఉంటుందని నేను అనుకొంటున్నాను అదేవిధంగా మన కాంగ్రెసు ప్రభుత్వము కూడా పని చేయా లని కోరుతున్నాను. ముఖ్యంగా వ్యవసాయ సంస్కరణల విషయంలో ప్రజలకు ఇవి వస్తాయా రావా అన్న సందేహము ఉన్నది. ఈ సందేహాలకు తావులేకుండా వ్యవసాయ సంస్కరణలు వెంటనే అమలు జరపడానికి ప్రభుత్వము పూనుకోవాలి. వ్యవసాయ సంస్కరణలు తెలంగాణాలో ఉండనే ఉన్నాయి. వాటినే adopt చేయడా నికి ప్రభుత్వము అభిప్రాయపడినట్లయితే అదైనా ఒకపర్యాయము స్పష్టంగా చెప్పి నట్లయితే ప్రజలలో అసంతృప్తి ఉండడానికి అవకాశం ఉండదు. అలా కాకుండా కొంత కాలయాపన చేసి, ఏదో ప్రజలకు జరగబోయే మేలునంతా ఆపబోతున్నారనే అభిప్రాయం కల్పించడం మంచిదికాదని నేను స్పష్టంగా ప్రభుత్వానికి తెలియ జేస్తున్నాను.

ఇంకో విచిత్రమైన విషయం ఏమిటంటే, వ్యవసాయం తరువాత వస్త్రపరిశ్రమ చాల ప్రధానమైనది. గవర్నరుగారు ప్రసంగం చేశారు. మిగతా మంత్రులు కూడా నిన్న కొంతమంది మాట్లాడారు. చేనేతవారికి ఏదో cess ఇస్తు న్నారనే అంకెలుచూపి, చేనేతవారికేదో ప్రత్యేకంగా స్వర్గరాజ్యం సృష్టింప బడిన ట్లుగా భావించి మాట్లాడడానికి ప్రయత్నం చేశారు. కాని ఈ అంకెలు గత 4, 5 సంవత్సరాలకు సంబంధించినాయని, ఇందులో సగానికి పైగా బట్ట కొనేవారికి రిబే టుగా ఇవ్వబడిందేగాని చేనేతవారికి ఒక కానీకూడా ఇవ్వడం లేదనే సత్యం బహుశా చాలామందికి తెలియదు. అంతేకాకుండా ప్రభుత్వం వేసే సిబ్బందికి కూడా ఇందులో 4 వ వంతు మించి అదనంగా ఖర్చు అవుతున్నది. చేనేత పారిశ్రామి కుడు సరాసరి పొందుతున్నటువంటి ప్రయోజనం ఏమిటంటే, కొన్ని వేలమందికి అచ్చులు, కొన్ని వేలమందికి పన్నెలు, కొన్ని వందలమందికి మగ్గాలు, ఇస్తున్నారు.

మన రాష్ట్రంలో 3 లక్షల మగ్గాలు ఉన్నప్పుడు కొన్ని వేలమందికి, పందల మందికి 5, 6 మాసాలలో వెడిపోయేటటువంటివి, 10, 15 రూపాయల ఖర్చుతో అచ్చులు, పన్నెలు ఇచ్చినంత మాత్రముచేత చేనేత పరిశ్రమకు బ్రహ్మాండమైన సహాయం చేస్తున్నట్లా? కాదు. కాని చేనేతవారికి కోట్లకొలది ధనం ముట్టుచున్నదనే దుష్ప్రచారం మాత్రం సాగుచున్నది. ఆవిధంగా కృష్ణమాచారిగారు కొంత విజయాన్ని సాధించారేమోనని నేను అనుకొంటున్నాను. అసలు ఈ cess ఇస్తామని చెప్పినప్పుడే మేము చాల స్పష్టంగా చెప్పాము. లక్షలు, కోట్లు జనాభాకు ఆధారంగా వున్న ఈ పరిశ్రమకు డబ్బురూపేణా సహాయం జరగడం అసంభవము. ఈ పరిశ్రమ బ్రతకాలనేదే ప్రభుత్వముయొక్క లక్ష్య మైనట్లయితే బట్టల యంత్రాల పోటీని నివారించడం కోసము చేనేతకు కొన్ని ప్రత్యేకమైన రకాలు కేటాయించాలని గత 15 సంవత్సరాలనుంచి చెపుతూ వచ్చాము. అదేమాట మరల cess ను ఏర్పాటు చేయబోయేటప్పుడు కూడా చెప్పాము. అయితే ఇది ఒక్క చేనేతవారు మాత్రమే చెపుతున్న మాటగాదు. మద్రాసు రాష్ట్రంలో 4, 5 కోట్ల ప్రజలకు ప్రాతినిధ్యం వహించిన శాసన సభలో ఏకగ్రీవంగా చేనేత పరిశ్రమకు చీరలు, దోవతులు కేటాయించాలని వారి బట్ట విడుదలకు సౌకర్యం కలుగచేయాలని అదే చేనేత పరిశ్రమ అభివృద్ధికి ప్రధానమార్గము అని స్పష్టంగా చెప్పారు. అంతటితో ఆగలేదు. బీహారు ప్రభుత్వము, హైదరాబాదు ప్రభుత్వము,- చివరకు మిల్లులకు ప్రధానకేంద్రంగా ఉన్నటువంటి బొంబాయి ప్రభుత్వము కూడా చెప్పింది. మనం ప్రజాస్వామిక యుగంలో ఉన్నామని, ప్రజాస్వామిక ప్రభుత్వములు నడుస్తున్నాయని అనుకొంటున్నాము.

హెచ్చుమంది చెప్పినవన్నీ పాటించడము యుక్తంగా భావిస్తున్న ఈ ప్రజాస్వామిక యుగంలో ఇండియాప్రభుత్వం తరఫున పనిచేస్తున్న కృష్ణమాచారిగారు మాత్రము హెచ్చుమంది చెప్పినటువంటి రక్షణలు చేనేత పరిశ్రమకు ఇవ్వకపోగా చేనేత పరిశ్రమను సర్వనాశనం చేసేటటువంటి, ప్రమాదకరమైనటువంటి విధానాన్ని ప్రవేశపెడితే. ఆ విధానంగురించి ఆంధ్రప్రభుత్వం మౌనం వహించడం చాల విచిత్రంగా ఉన్నదని మనవిచేస్తున్నాను. ఆంధ్ర ప్రభుత్వానికి ఒక విధానమంటూ లేదా? అని నేను ప్రశ్నిస్తున్నాను. ఆంధ్ర ప్రభుత్వము ఇదివరకు అనేకసార్లు ఈ శాసనసభలోను, బైటకూడా చాల స్పష్టంగా చెప్పింది. చేనేత పరిశ్రమ

యొక్క శాశ్వత రక్షణకోసము ఉమ్మడి మద్రాసు రాష్ట్రము కోరినవిధంగా చేనేతకు చీరలు, ధోవతులు కేటాయించాలనే మేము కోరుతున్నాము. Power looms యొక్క ప్రసక్తి వచ్చినపుడు Power looms ను ముందుకు తీసుకురావడం మా అభిమతం కాదని గత బడ్జెట్ ప్రసంగంలో మన పరిశ్రమల మంత్రిగారు స్పష్టంగా ప్రకటన చేశారు ప్రభుత్వానికి ఒక విధానం ఉన్నదని అనుకొన్నప్పుడు ఎక్కడో పొరబడుతున్నటువంటి విధానం గురించి మరల మేము ఎటపటాయిస్తున్నాము అలో చిస్తున్నామని చెప్పేటటువంటి ఆవశ్యకత ఎందుకు ఏర్పడుతుందనేదే సందేహం. దీనిని బట్టి ఆలోచిస్తే clear thinking, అనేది Centre లో గాని రాష్ట్రాలలోగాని లేకుండా పోతున్నదేమోననే భయము, సందేహము కూడా ఏర్పడుతోంది. అసలు చేనేత పరిశ్రమ అవసరం లేదు, ఇది పోవలసిందే అంటే మాకేమీ అభ్యంతరంలేదు. ఈ చేనేత పారిశ్రామికులంతా వృత్తిలేకుండా బ్రతకడానికిగాను ఉద్యోగాలు చేసేవారి దగ్గరనుంచి, భూములున్నవారి దగ్గరనుంచి, భవనాలున్నవారి దగ్గరనుంచి, సంపద ఉన్నవారి దగ్గరినుంచి డబ్బుతెచ్చి ఇచ్చేటట్లయితే మాకేమీ అభ్యంతరం లేదు. అయితే మేముకూడా వృత్తిచేసుకొని బ్రతకాలని కోరుతున్నాము తప్ప ఒకరి దయా దాక్షిణ్యాలపైన గాని, ఒకరి సంపదపై ఆధారపడి బ్రతకాలని గాని కోరుకోవడం లేదు Power మగ్గాలు తీసుకొచ్చేముందు T. T Krishnamachari garu "దేశంలో 36 కోట్ల జనాభా ఉన్నారు. 1960 నాటికి 40కోట్లు జనాభా అవుతారు. ఇప్పుడు మనిషికి 13 గజాల బట్ట వాడకం చేస్తున్నారు ఇకనుంచి తలకు $18\frac{1}{2}$ గజాల బట్ట వాడకం చేస్తారు ఆ విధంగా చూస్తే 740 కోట్ల గజాల బట్ట కావలసి వస్తుంది. 100 కోట్ల గజాల బట్ట విదేశాలకు కావలసివస్తుంది. మొత్తం 840 కోట్ల గజాల బట్టలో మిల్లులు 500 కోట్ల గజాల బట్ట తయారు చేస్తున్నాయి. Power మగ్గాలు 20 కోట్ల గజాలబట్ట తయారు చేస్తున్నాయి. చేమగ్గాలు 28 లక్షలు కలసి 150 కోట్ల గజాలబట్ట తయారు చేస్తున్నాయి. ఈ 670 కోట్లు పోతే 170 కోట్ల గజాల బట్ట తయారు చేసేదానికోసం అందులో ముఖ్యంగా 20 కోట్ల గజాల బట్టమాత్రమే తయారు చేసేదానికోసం 35 వేల Power మగ్గాలు పెడుతున్నామని" చెప్పారు. 20 కోట్ల గజాల బట్టకోసం పవరు మగ్గాలు పెట్టవలసిన ఆవశ్యకత ఏమి ఉన్నదని నేను ప్రశ్నిస్తున్నాను. ఎందుచేతనంటే దేశంలోని రాష్ట్రప్రభుత్వాలన్నీ కలసి 28 లక్షల మగ్గాలు ఉన్నాయని చెప్పినవి, అయితే ఇండియా ప్రభుత్వం ఆ అంకె సరైనది కాదని చెప్పడానికి వారిదగ్గర ఆధారము లేకపోయినా చాటంగానే చెపుతున్నారు.

రాష్ట్రప్రభుత్వాలు అంకెలు సేకరించి 28 లక్షల మగ్గాలు ఉన్నాయని చెప్పినపుడు కాదని చెప్పడములో అర్థంఏమిటి? కనుంగో కమిటీవారి అంచనా తీసుకొన్నా, వారు కూడా 20 లక్షలు మగ్గాలు ఉంటాయని నిస్సందేహంగానే చెప్పారు. అయితే కమిటీవారు కూడా వారు చెప్పిన అంకెలు, వీరుచెప్పిన అంకెలు కూడికవేసి రాష్ట్రప్రభుత్వాలు చెప్పిన అంకెలు సరైనవి కావని, చివరకు 20 లక్షల మగ్గాలు ఉన్నాయని అన్నారు. ఒక్కొక్క మగ్గము సులువుగా సంవత్సరానికి 2000 గజాల బట్ట తయారు చేస్తుందని ఇండియా ప్రభుత్వము చెపుతున్నది. అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు చెపుతున్నాయి.

ఆ ప్రకారం ఒక్క చేమగ్గాలు 20 లక్షలు గనుక సంవత్సరం పొడుగునా పనిచేయిస్తే, 400 కోట్ల గజాల బట్ట తయారవు తుంది. అంటే ఈవేళ తయారుచేసే 150 కోట్ల గజాల బట్టకాక, మరొక 250 కోట్ల గజాల బట్ట అదనంగా తయారుచేయుటకు కావలసిన సాధన సంపత్తి, అనగాచేమగ్గాలు, trained and efficient workers దేశములో ఉన్నప్పుడు ఈవేళ నూతనంగా 35 వేల పవరు మగ్గాలు కావాలనడం ఎందుకు? కొత్తగా తాతా, బిర్లాగారు పెట్టిన power looms manufacturing Companies తాలూకు power looms కొనేటటువంటి, దిక్కుఉండదని అంటున్నాను. ఈవేళ ఇండియా ప్రభుత్వమువారి పరిశ్రమలను అభివృద్ధి చేయడం కోసమని వారి power మగ్గాలను చేనేత వారిపై రుద్దడానికి ప్రయత్నం చేస్తున్నట్లుగా ఉన్నది. ఇది అభివృద్ధిని కోరి కాదంటున్నాను. అభివృద్ధి అంటె ఏమిటి? రెండవ పంచవర్ష ప్రణాళికలో చాలా స్పష్టమైనటువంటి సిద్ధాంతాలు చెప్పారు. దేశములో హెచ్చుమందికి పని కల్పించడమే ఈ ప్రణాళిక యొక్క లక్ష్యమన్నారు. కుటీర పరిశ్రమలను గ్రామపరిశ్రమలను పెంపొందించాలని అన్నారు. ఈ కుటీర పరిశ్రమలను, గ్రామ పరిశ్రమలను పెంపొందించడం కోసం గాను భారీ పరిశ్రమలకు, కుటీర పరిశ్రమలకు హద్దులు ఏర్పాటు చేయాలని చెప్పారు. చేనేత పరిశ్రమకు, protected market కల్పించండి. చీరలు, ధోవతులు, అంతా కలిసి 170 కోట్ల గజాలు మాత్రమే అవుతుంది. ఈ వేళ 250 కోట్ల గజాలబట్ట చేనేత పారిశ్రామికులకు ఇవ్వబోతున్నాము. భయపడవలసిన అవసరంలేదు. అందువల్లనే 20 కోట్ల గజాల బట్టమాత్రమే కొత్తగా పెట్టబోయే పవరు looms కు ఇస్తామని అంటున్నారు. కాని power looms గురించి, ఇదివరకు విచారణ చేసిన కమిటీలన్నీ కూడా ఈ power looms అనేవి చేమగ్గానికి

serious rival అని చెప్పినాయి అంతేకాదు, చేనేత పరిశ్రమకు ప్రాణాంతకం చేసినాయి ఈ power looms అని స్పష్టంగా అనేక కమిటీలు చెప్పినాయి ఆ కమిటీలన్నీ ఆ విధంగా చెప్పినాయి అయినా పవరు మగ్గాలను పెట్టాలని భారత ప్రభుత్వం అంటున్నది. అయితే ఒకటి మాత్రము హెచ్చరిక చేస్తున్నాను. బహుశ, క్రిష్ణమాచారి గారు గాని, మరొకరుగాని ఈ power looms వస్తే చేనేత పరిశ్రమ సంపూర్ణంగా నాశనం అయిపోతుందని పెట్టుబడి దారులు దేశములో ఏర్పడరాదని అనుకొంటున్నారేమో, అది కేవలం పొరబాటైనటువంటి విషయం అని మాత్రం నేను మనవి చేస్తున్నాను. ఎందుకంటె, గత 150 సంవత్సరాలలో, ఇప్పటి వరకు ఒక క్రిష్ణమాచారిగారు ఉదయిస్తే బహుశ వెయ్యిమంది కృష్ణమాచార్లుగార్లు ఉదయించి ఉంటారు, ఈ 150 సంవత్సరాలలో ఈ చేనేత పరిశ్రమను సర్వనాశనం చేయడానికి గాను, జరిగిన ప్రయత్నాలు ఇన్నీ అన్నీ కావు. East India Company వారు చేసిన అక్రమ చర్యలైతేనేమి. తరువాత బ్రిటిష్ ప్రభుత్వము ప్రవేశపెట్టినటువంటి శాసనాలు, వారు ప్రవేశ పెట్టినటువంటి నిర్బంధాలు, అతరువాత, స్వరాజ్యము వచ్చిన తరువాత చేనేత పరిశ్రమకు నూలు లేకుండగా మన జాతీయ ప్రభుత్వము చేసిన టువంటి పొరబాట్లు. వీటి ఫలితంగా ఆనాడుకూడ గోపాలరెడ్డిగారు మద్రాసులో ఆర్థిక మంత్రిగాను లేకపోతే, మన సీతారామరెడ్డిగారు పరిశ్రమల మంత్రిగాను, లేకపోతే మన సంజీవ రెడ్డిగారు మరొక మంత్రిగాను ఉన్నటువంటి ఆ ప్రభుత్వములో 30 లక్షల రూపాయలు un-employment doles క్రింద పంచిపెట్టవలసిన దుస్థితి ఏర్పడింది అందువల్ల ఈ దేశములో ఉన్నటువంటి చేమగ్గాలయొక్క సంరక్షణ, రాష్ట్రప్రభుత్వాల మీద ఆధారపడియున్నది. కేంద్ర ప్రభుత్వానికి ఏదో అధికారము ఉన్నదని రాష్ట్రప్రభుత్వాలు దానిమీద మౌనము వహించడం సరికాదు. ఉదాహరణకు, Travancore Cochin రాష్ట్రములో Advisors regime ఉన్నది. After all అక్కడ ఆఫీసర్లు పెత్తనం చేస్తున్నారు. వారు అప్పుడే చాలా స్పష్టంగా చెప్పారు ఇండియా ప్రభుత్వానికి ఒకవైపు power-looms వల్ల చేనేత పరిశ్రమ దెబ్బతిన్నది. కాబట్టి ఈ చేనేత పరిశ్రమను అభివృద్ధి చేయనివడంకోసమని అనేక ప్రణాళికలు ఆలోచిస్తున్నామని చెపుతూ, మరొకప్రక్క మళ్లీ power looms ను ప్రవేశ పెట్టడం చేనేత పరిశ్రమకు సరాసరి గోతులను త్రవ్వడం కాక మరేమిటి అని ఒక Advisory regime లోఉన్నటువంటి Travancore Cochin ప్రభుత్వము ఇండియా ప్రభుత్వానికి స్పష్టంగా చెప్పగలిగినప్పుడు, మన గాంధేయ సిద్ధాంతం ప్రకారం

దేశాన్ని స్వర్గంగా సృష్టించాలని, ఒక అమరరాజ్యం, ఒక రామరాజ్యం సృష్టించాలని అనుకొన్న కాంగ్రెస్ ప్రభుత్వము దీనికి వెరవవలసినటువంటి అవసరం, మౌనం వహించవలసినటువంటి అవసరము ఏమిటి అని, రాష్ట్రములో ఉన్నటువంటి ప్రజలకు అనుమానం కలిగించేటటువంటి పరిస్థితి ఎందుకు రావాలి అని నేను సరాసరి సూటిగా ప్రశ్నిస్తున్నాను. నిడుబ్రోలులో యిటీవలనే ముఖ్యమంత్రి గారిని నేను కలుసుకొన్నప్పుడు వారు చాలా సానుభూతిగా చెప్పారు. 'నేను అప్పుడే కృష్ణమాచారిగారితో వారి విధానం పట్ల విపరీతమైన అసంతృప్తి ఉన్నదని చెప్పాను. ఆంధ్ర ప్రభుత్వము ఈ విషయములో త్వరపడి చేనేత పరిశ్రమకు నష్టమువచ్చే ఏ విధానాన్ని అనుసరించదనికూడా వారు నాతో చెప్పారు. అది విని చాలా సంతోషపడ్డాను. కాని తిరిగి, కర్నూలునుండి, Power looms కోసం T. T క్రిష్ణమాచారి గారు ఇచ్చేటటువంటి డబ్బును మేము తీసుకోడానికి సిద్ధంగా ఉన్నామని వెంకటరావు గారు ప్రకటించారు. అది యదార్థమో కాదో తెలియదు. కాని నేను వారితో మాట్లాడినప్పుడు మేముకూడా ఈ విషయాన్ని గురించి ఇంకా యేమీ నిర్ణయం చేయలేదు, ఆంధ్రరాష్ట్ర చేనేత సహకార సంఘంవారు ఇంకా ఇతర సంస్థలు అన్నీకూడా కలసి ఆలోచిస్తున్నాయి కాబట్టి వారి ఆలోచనలన్నీ సావధానంగా పరిశీలించిన మీదటనే మేము ఒక నిర్ణయానికి వస్తామని చెప్పారు. అంతవరకు సంతోషమే కాని మొత్తం మీద ఈ ప్రసంగంలో మాత్రం, ఇంత ప్రధానమైనటువంటి విషయాన్ని omit చేయడం అంత బాగాలేదు. ఇదిచాలా అసంతృప్తికి కారణం అయింది. ఒక విషయం మాత్రం హెచ్చరిక చేయాలి. చేనేత పరిశ్రమకు డబ్బు ఖర్చుపెట్టి బ్రతికించాలని అనుకొంటున్నారేమో! అందువల్లకాదు చేనేత పరిశ్రమ బ్రతుకుతున్నది, ఇప్పుడు ముదలియారుగారు ఉన్నారు. ఆ విధంగా కొంతమంది మగవాళ్లు పాశ్చాత్య నాగరికతావ్యామోహములో పడిపోయి, అవసరమున్నా లేకపోయినా, అవసరమైప్పుడు లేకపోయినప్పుడు వేషాలు మార్చివేస్తున్నారు. కాని దీనికి ఏదో Buckingham Carnatic Mill, తాబాకు drill లేకపోతే France లో ఉన్న surge గాని,

Sri RANGANATHA MUDALIAR ఏకారణం చేతనూ నేను మార్చలేదు.

Sri S RAGADA KOTAIAH వేషాలండి నేను చెప్పేది. మగవారు ఎన్ని వేషాలు మార్చినా మన స్త్రీలు మాత్రము వేషాలు మార్చలేదు. మగవాళ్లు మామూలుగా hat, boot, suit వేసినట్లు వారి భార్యలుకూడ తెల్లవాళ్లవలె గౌనులు వేసినట్లయితే

చేనేత పరిశ్రమ ఎప్పుడో నాశనమై యుండేది పగవాళ్లు ఎన్నిచెప్పినా, మనదేశములో ఉన్న ఆడవాళ్లు మాత్రం సంస్కృతి సాంప్రదాయాలను మార్చుకోలేదు. దాని ఫలితంగానే ఈ వేళవరకు చేనేత పరిశ్రమ బ్రతికి ఉన్నది. ఇదే దానికి శ్రీరామ రక్ష. అందువల్లనే, ఈవేళ 10 వేల Power మగ్గాలు పెట్టిన ఫలితంగా చేనేత పరిశ్రమ కొంతవరకు క్షీణించినా మొత్తంగా, క్రిష్ణమాచారిగారు ఆశించినట్లుగా, ఈ చేనేత పరిశ్రమను నెట్టివేయడానికి సాధ్యంకాదు. అది బ్రిటిష్ ప్రభుత్వానికీ సాధ్యంకాలేదు. East India Company కి సాధ్యంకాలేదు. నూరు సంవత్సరాలుగా ఏర్పడిన బట్టల యంత్రాలకు సాధ్యంకాలేదు. క్రిమాష్ణచారిగారికికూడ సాధ్యంకాదు. అయితే వీరి జీవితాన్ని కృంగతీస్తున్నారు. ఆలాంటిది రేకుండా ఈ దేశంలో చేనేత పారిశ్రామికులు కూడా మిగతా శ్రమజీవులతోపాటు, సమానమైనటువంటి గౌరవస్థాయిలో బ్రతకడానికి అవకాశము కల్పించే విధంగా ఈ పరిశ్రమకు శాశ్వత రక్షణ కల్పించి వీరలు, ఫోవతులు కేటాయించేట్లుగా ఆంధ్ర ప్రభుత్వము గట్టి ప్రయత్నం చేయవలెనని, ఆంధ్రప్రదేశ్ లోకిపోయిన తరువాత కూడ ఈ సమస్యా పరిష్కారానికి కృషిచేయవలసిందని కోరుతూ నేను సెలవు తీసుకొంటున్నాను

Mr. Dy SPEAKER సభ తిరిగి 2½ గంటలకు సమావేశమవుతుంది.

After lunch (2-30 P M)

(Mr SPEAKER In the Chair)

Sri D. KONDAIAH CHOWDARY అధ్యక్షా, గవర్నరుగారు యిచ్చిన address కు వారిని నేను అభినందిస్తూ, శ్రీ వేమారెడ్డిగారు ప్రవేశపెట్టిన తీర్మానాన్ని బలపరుస్తున్నాను. గ్రామోద్యోగస్థుల కోర్కెల విషయములో ప్రభుత్వము తీర్మానముచేసిన కనీస సౌకర్యముల విషయము పత్రికలలో ప్రచురించబడింది. నేను చూచాను. గ్రామోద్యోగస్థులను కొంతవరకైనా ప్రభుత్వం సంతృప్తి పరచగలందులకు ప్రయత్నంచేసినది, కాని అది పూర్తిగా వాళ్లను సంతృప్తి పరచినట్లు తెలియలేదు గ్రామోద్యోగస్థులను సంపూర్ణముగా తృప్తిపరచటానికి ప్రభుత్వమునకు ఉన్న ధనాభావమువల్ల వీలులేకపోతున్నదని రెవిన్యూ మంత్రిగారు, ముఖ్య మంత్రిగారు పదే పదే చెబుతున్నారు. పోయిన సంవత్సరమే నేను ఒక సూచన యీ సభలో చేసియున్నాను ఆ సూచనను ప్రభుత్వం పట్టించుకోలేదు గ్రామోద్యోగస్థుల సంఘమువారు కూడ పట్టించుకోలేదు. వాళ్లకు జీతాలు హెచ్చుచేయటానికి ధనాభావమువల్ల వీలు లేకపోతున్నదని ప్రభుత్వం చెప్పుతున్నది. అది నిజమైతే కావచ్చు. వాళ్లు కోరేది కనీసము ఒక్క lower division గుమాస్తాకు యిచ్చే జీతము అయినా యివ్వాలని అంటే, దానిని యివ్వటానికి కొన్ని కోట్ల రూపాయలు అవసరము ఉంటుందని

ప్రభుత్వం జవాబు చెబుతున్నది. ఈ విషయము యిప్పటికి ఎన్నో నెలలనుంచి, సంవత్సరాలనుంచి జరుగుచున్నది ప్రభుత్వము ఏ విధమైన తృప్తిని కలుగజేయలేక పోతున్నందున, గ్రామోద్యోగస్థుల విధులు స్తంభించిపోయే పరిస్థితులు ఏర్పడినవి ఆ విధంగా కాకుండా ఒక విధమైన పరిష్కార మార్గమును నేను సూచించాను ప్రభుత్వము జీతము హెచ్చుచేయలేని పక్షములో, యీనాడు ప్రాజెక్టులు ఏర్పడుతున్న సమయములో, ప్రాజెక్టుల క్రింద భూములుగాని, లేక గవర్నమెంటు బంజరు భూములు, సాగుకు లాయకీగా ఉన్నవి, వాళ్లకు ఎక్కడ వీలుగా ఉంటే అక్కడ అయిదు ఎకరాలో, పది ఎకరాలో యివ్వవలసిందనిన్నీ, ఆ భూములు విభజనకాకుండా గ్రామోద్యోగస్థులు ఎంతకాలము పనిచేస్తే అంతకాలము వాళ్ల స్వాధీనంలో ఉంచుకొని అనుభవిస్తూ, transfer అయిగాని, మరొకరి చేతిలోనికిగాని పోయే సందర్భములో ఆ భూములు వారికి hand over చేసే విధానంలో యిస్తే, వాళ్లను సంపూర్ణముగా తృప్తి పరచటానికి వీలు అవుతుందని సూచించాను. ఈ సూచన రాష్ట్రంలో గ్రామోద్యోగస్థు లందరికిని సమ్మతముగానున్న దనిన్నీ గ్రామోద్యోగస్థుల సంఘముకూడ ఆమోదించినట్లుగాను తెలుస్తున్నది. కాబట్టి ప్రభుత్వము యీ సూచన అంగీకరించటానికి అభ్యంతరము ఉండటానికి అవకాశము లేదని నా అభిప్రాయము. ఇది చాలా సమంజసమైన సూచన, ఆచరణయోగ్యముకూడ ఇది ప్రభుత్వానికి లాభసాటి, ఎక్కువగా డబ్బు వ్యయము కానేరదు. ప్రభుత్వ కార్యకలాపాలు సక్రమంగా నెరవేరుతవి ప్రభుత్వం యీ విషయములో దీర్ఘాలోచనచేసి, పురాతన సాంప్రదాయాని కనుగుణంగా ప్రభుత్వం యీ విషయములో శ్రద్ధవహించవమని కోరుచున్నాను

The Hon Dr B GOPALA REDDI ఇప్పుడు యిస్తున్న జీతంతోనా, లేక అది కాకుండానా, యీ భూములు?

Sri D KONDAIAH CHOWDARY వాళ్లు కోరింది, జీతానికి బదులేనంటి. ఇంక జీతము అనేది లేకుండా అన్నమాట. వారు చెప్పినది యేమిటంటే, "మాకు జీతము అవసరము లేదు అయిదు ఎకరాల మాగాణీ భూమి యివ్వండి. అది ప్రభుత్వముయొక్క భూమి కాబట్టి, అందులోని ఫలితమును అనుభవిస్తూ, మా విధులు నెరవేర్చుతూ ఉంటాము. మా చేతులలోనుంచి ఉద్యోగము మారితే, దానితో బాటు భూమికూడ స్వాధీనముచేస్తాము" అని అన్నారు. కాబట్టి యిది చాలా మంచి సూచన. కాబట్టి ప్రభుత్వము యీ విధానము అంగీకరించవలెనని అంటున్నాను.

ఏ గ్రామములోని వారికి ఆ గ్రామములోనే పీటు అయినంపిపటికు యిప్పించుకోవాల అంటున్నాను.

ఇకపోతే నాగార్జునసాగర్ కుడి కాలువ కాంక్షను విషయములో ప్రభుత్వం చాలా శ్రద్ధ తీసుకుంటున్నారు ఈ విషయములో గవర్నరుగారుకూడ తీసుకుంటున్న శ్రద్ధ అమోఘముగా ఉన్నది. ఈ కాలువ కాంక్షను అయి, మొదలుపెట్టినప్పటినుంచి కూడ అనేకమైన క్లిష్ట పరిస్థితులు వచ్చి తప్పిపోయినవి. ఇది ముఖ్యంగా గుంటూరు, నెల్లూరు జిల్లాలవారికి ఎక్కువగా ఉపయోగిస్తుంది పదూరు ఇరవై లక్షల ప్రజలకు పైగా జీవించగలుగుతారు. కాని దురదృష్టవశాత్తు ఏమి జరిగిందోగాని మొదటనుంచి కూడ ఇంజనీరింగు నిపుణులు యిచ్చిన సలహాలను త్రోసిపుచ్చి యీ కాలవమట్టాన్ని తగ్గింపడము జరిగింది. అందువల్ల మెట్ట తాలూకాలలో ఎక్కువగా బాధపడుతున్న ప్రజలకు యీ కాలువ ఉపయోగపడకుండాపోవున్నది కాని ప్రస్తుత పరిస్థితులలో, అప్పటికిని కొంత సంతృప్తిపడి, మన గోపాలకృష్ణయ్యగారు చెప్పినట్లు 24 వేల క్యూసెక్కులు మొదలుకొని 21 వేల క్యూసెక్కుల నీరు పారించటానికి కాలువను తగ్గించి త్రవ్వుతారని తెలిసింది. దీనివల్ల మెట్ట తాలూకాలకు కొంత నీరు అయినా పారుతుందని ఆశించాము. కాని ఈ మధ్య దీనికి కేంద్ర ప్రభుత్వంవారు యిచ్చే డబ్బు విషయములో యీ కాలవకు ఖర్చు తగ్గించవలసిందిగా సలహాయిచ్చినట్లు తెలుస్తున్నది ఈ ఖర్చు తగ్గించటానికి మన Engineering Department వారిని Revenue Department వారు అడిగితే, మొదటి దశలో 7 వేల క్యూసెక్కుల నీరు సరిపోతుంది, అంతవరకే నీరు పారుదల అయ్యేటట్లుగా కాలవను త్రవ్వి మీలు అయినంత ఉపయోగపడేటటు చేస్తామని వెంకటకృష్ణయ్యగారు సలహా యిచ్చారట. అయితే దానిని ప్రభుత్వం త్రోసిపుచ్చినట్లుగా మేము విన్నాము. ఈ సంగతి గురించి ముఖ్య మంత్రిగారు Collectors తో మాట్లాడినప్పుడు, "మీరు మాకు వ్రాయండి, నేను కనుక్కొని, యిది నిజముకాదు, 27 క్యూసెక్కుల నీరు పూర్తిగా పచ్చేటట్లుగా కాలువను త్రవ్విస్తామని ప్రభుత్వం ప్రకటిస్తుంది" అని ముఖ్య మంత్రిగారు చెప్పారు. ఈ అవకాశమును పురస్కరించుకొని ప్రభుత్వము ఒక ప్రకటనచేస్తే అక్కడ ఉండే రైతులకు, యితరులకు, ఆందోళన లేకుండా ప్రజలను తృప్తిపరచటానికి వీలవుతుంది. ప్రభుత్వము ఆ విధముగా చేస్తారని ఆశిస్తున్నాను.

ఫారెస్టు రైతుల విషయము మేము పదే పదే చెప్పుకుంటున్నా ప్రయోజనం లేక పోయింది. గత సంవత్సరం మన ముఖ్య మంత్రిగారే ఫారెస్టు మంత్రిగా

ఉన్నపుడు ఆయన, ఫారెస్టుల కన్సర్వేటరుగారిలోను, అటవీ శాఖ రైతులతో సంబంధంగల M.L.A లు కలసిన సమావేశము జరిపేరు ఆ సమావేశములో క్రొత్తగా ఎస్టేట్లనుంచి క్రొత్త ఫారెస్టులను ఏర్పాటుచేసినపుడు అక్కడి రైతుల హక్కులకు భంగము కలుగకుండా చేస్తామని హామీ ఇచ్చేరు గాని అనుభవములో తేలింది ఏమిటంటే- మేము ఆ సమావేశములో చెప్పినది ఏమీ జరుగలేదు

The Hon Dr B GOPALA REDDI మేము extra staff ను కూడా ఇచ్చినాము. పని జరుగుచున్నది.

Sri D KONDIAH CHOWDARY Staff ఇచ్చారు ఎక్కువ. Reserve forest పెడుతూ ఉన్నారు. గాని రిజర్వు ఫారెస్టు పెటుతున్నప్పుడు అక్కడి గ్రామ సరిహద్దులలో పెడితే స్థానిక రైతుల పశువులు బయటకు వస్తే అధికారులు బాధలు పెడుతున్నారు. ఆ బాధలకు రైతులు తట్టుకోలేకపోతున్నారు. కాబట్టి గ్రామానికి మైలు దూరములో రిజర్వు ఫారెస్టు ఉండేటట్లు ఏర్పాటు చెయ్యమని మేము చెప్పేము గాని ఇప్పుడు ఊరి గ్రౌండ్లలోనే రిజర్వు ఫారెస్టు రాళ్లు పాతుతున్నారు దానివల్ల అధికారుల బాధలుతప్ప ఫారెస్టు పెరగదు. రెండూ చెడిపోతవి కాబట్టి గ్రామం చుట్టు ఒకమైలు విడిప్రదేశము వదలి రిజర్వు పారెస్టు పెట్టవలెను నెల్లూరుDistrict Forest Officer గారి వద్దకు వెళ్లి, గ్రామంలో పారెస్టు రాళ్లు పాతుతున్నారని చెపితే, ఏమి చెయ్యమన్నారు అధికారులు ఇన్నివేల ఎకరాలు పెట్టవలెను అని తాఖీదులు ఇచ్చారు, అని అన్నారు. కావున రైతుల మేలు ఆలోచించి గ్రామానికి ఒక మైలు దూరములో రిజర్వు ఫారెస్టు నిర్మించేటట్లు చూడవలెనని, ఉత్తరువులు ఇవ్వవలెనని ప్రార్థిస్తున్నాను.

ఇంతవరకు జిల్లా బోర్డుల విషయం మన మొదలియారుగారు చెప్పేరు. నేను కూడా advisory committee లో ఉన్నాను మెంబరుగా. ఈ ద్వంద్వ ప్రభుత్వం వల్ల పరిస్థితులు మరీ హీనముగా ఉన్నాయి. రోడ్లు కొంచం బాగుపడినవి ప్రెసిడెంట్లు లేరు కాబట్టి జిల్లా కలక్టరు పరిపాలన సాగుతూ ఉంది ఆయనకు బాధ్యత లేదు కాబట్టి ఎలక్షన్సు పెట్టి, elected district boards తీసుకొనిరండి, లేకపోతే ప్రభుత్వంలో వీటిని merge చెయ్యండి. రోడ్లు బాగుచెయ్యవచ్చును ఎలిమెంటరీ స్కూలు టీచర్లు ఎక్కడా పని చెయ్యడంలేదు. ఏ వావిలాలవారి పార్టీకో, నాగిరెడ్డిగారి

పార్టీకో పనిచేస్తూ కూర్చుంటే కలెక్టరుగారు ఏమీ చెయ్యలేకపోతున్నారు కలెక్టరు గారిని అడిగితే నేను ఏమి చెయ్యగలను. ఇది అంతా stop gap arrangement అని అంటారు కాబట్టి డిశంబరు లోపుననే ఎలక్షన్సు పెట్టి ఈ ద్వంద్వ పరిపాలనను అంతముచెయ్యండి. దానికి ఖర్చుకూడా ఏమీలేదు. అలా elected district boards ను తీసుకొని రాలేకపోతే ప్రభుత్వంలో కలిపివేస్తే ఎవరికీ ఏమీ హాని ఉండదు. ఇక్లీ వాయిదా వెయ్యకుండా ఎలక్షన్సు తీసుకురావలెను. జిల్లా బోర్డులను ఏర్పరించడమో అంతమొందించడమో చెయ్యవలెనని నేను మనవిచేస్తున్నాను

Sri P. SREERAMULU అధ్యక్షా ! గవర్నరుగారు చేసిన ప్రసంగాన్ని శ్రీ వేమారెడ్డిగారు ప్రతిపాదించిన అభినందన తీర్మానమును బలపరుస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగములో రాబోయే, విశాలాంధ్రను గురించి చేస్తున్న ఏర్పాటులను గురించి, మనము పొందబోయే అభివృద్ధిని గురించి ప్రస్తావించి ఉన్నారు. అందులకు రాష్ట్ర ప్రభుత్వాన్ని అభినందించవలసి ఉన్నది. పోతే వారి ప్రసంగములో, వివిధ రంగాలలో, వివిధ శాఖలలో జరుగుచున్న పనుల గురించి అనేక కార్యక్రమాల గురించి, ప్రభుత్వ విధానాల గురించి వివరించారు. అందులో ఒక్కొక్క విషయము పరిపూర్ణముగాను, సంతృప్తికరముగా లేదేమోనని ఒక విధముగా భావించవలసి వస్తుంది.

అందులో మొట్టమొదటి విషయము, రాష్ట్రములో ప్రత్యేకముగా డెల్టా ప్రాంతములలో ఉన్న రహదారుల గురించి ప్రభుత్వ దృష్టికి తీసుకురాదలచుకున్నాను. ఈ మధ్య, క్రిందటి నెలలో, నరసాపురంలో మా తాలూకాకు ముఖ్య మంత్రిగారు స్థానిక సంస్థల మంత్రిగారు పర్యటనకు వచ్చినందుకు వారిని అభినందిస్తున్నాను. ఏ సమయములో వారు వచ్చి చూచి తనిఖీ చెయ్యవలసి వుంటుందో ఆ సమయములోనే వారు వచ్చినందులకు వారిని అభినందిస్తున్నాను. ఈ రోడ్ల స్థితి చాలా అధ్వాన్నముగా ఉన్నది. ఎన్ని సంవత్సరాల క్రిందటనో వేసిన జిల్లా బోర్డు రోడ్లుగాని, High Ways రోడ్లుగాని, గవర్నమెంటు స్వాధీనములో ఉన్న రోడ్లుగాని, వేసినవి వేసినట్లే ఉన్నవి. వాటన్నింటిని ఇంకా రెండు మూడు సంవత్సరములు maintenance లేకుండా యీ రకంగానే వుంచితే, మళ్లా కొత్తగా రోడ్లు వేసుకోవలసివస్తుంది. పదివేల రూపాయలతో కావలసిన దానికి, కొన్ని లక్షలు ఖర్చు చేయవలసిన పరిస్థితి ఏర్పడుతుందని హెచ్చరిస్తున్నాను. కాని మన అదృష్టమో, దురదృష్టమోగాని కొంత

మంది మంత్రులుగా లేనంతకాలం ఎంతో కోమల హృదయములతో వుండినా అపరాక్రమములో, మంత్రులుకాగానే వారు కఠినపాషాణ హృదయులుగా మారుతున్నారని ఒక విధమైన సందేహము కలుగుచున్నది మన ఫైనాన్సు మినిష్టరుగారు, పీనాసి మంత్రిగా తయారగుచున్నారని ప్రజలలో అనేక మంది అనుకోకుండా వుండడములేదు. ఈ భావం ప్రజలలో వ్యాప్తికి రాకుండా మన ముఖ్య మంత్రిగారు ప్రయత్నించాలని నేను సవినయంగా మనవి చేస్తున్నాను

The Hon. Dr B. GOPALA REDDI ఉండి ఖర్చుపెట్టకపోతే పీనాసి అవుతుంది, లేక ఖర్చు పెట్టకపోతే ఏమవుతుంది?

Sri P SREERAMULU రాష్ట్రములో N. E S. Blocks Selection లో ప్రభుత్వం కొంతమార్పు తీసుకురావలెనని ముఖ్య మంత్రిగారికి, ప్రణాళికల మంత్రిగారికి మనవిచేస్తున్నాను. ఇప్పుడు ప్రతి జిల్లాలోను ఏ ఒక్క మూలనో ఎన్నికచేసి, ప్రతి దఫా ఆ ప్రాంతానికే ఆనుకొని contiguous గా వుండే ఫిర్కాను select చెయ్యడము అమలులో ఉన్నది. అట్లా కాకుండా ప్రతి జిల్లాకు, రెండు వైపులనుండి రెండు బ్లాకులను ప్రతి తడవా సెలెక్టుచేస్తూ వస్తే జిల్లా అంతా సత్వరంగా ఈ అభివృద్ధి కార్యక్రమాల ప్రయోజనం పొందడానికి వీలుగా ఉంటుందని నేను భావిస్తున్నాను. ఈ సూచనను ముఖ్య మంత్రిగారు ప్రణాళికల మంత్రిగారు అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

ఈ విషయంలో వరదలను గురించి రెవిన్యూ మంత్రిగారు చేసిన ప్రసంగానికి, చప్పు సందర్భంలో గవర్నరుగారి ప్రసంగములోనే మనకు చర్చించడానికి అవకాశమివ్వడానికి ముఖ్యమంత్రిగారు అంగీకరించారు ఈ వరదలు నిజంగా వెనుకటి రోజుల్లో వస్తున్నట్లుగా, 10 సంవత్సరాలకో 15 సంవత్సరాలకో వరదలు రావటం కాదు. కృష్ణా గోదావరి నదుల్లో, తరువాత ఈ వరదలనుగూర్చి మనము ముందుకూడా దాదాపు ఒకటి రెండు సంవత్సరాలు లేకపోయినప్పటికీ కూడా రావటం పరిపాటి అయిపోయింది. ముఖ్యంగా delta ప్రాంతాలలో ఈ మురుగు నీటి పథకాలను అమలు పరచకపోవటంవల్ల ఈ వరదలు ఏరులుగావచ్చి కృష్ణా, గోదావరి నదులలో వరదలు రావటమే కాకుండా delta ప్రాంతాలలో నున్నటువంటి మురుగునీటి పథకాలు అమలుజరుగకపోవటం వల్ల ఈ ప్రమాద పరిస్థితి అధిక

వర్షాలు కురిసినటువంటి ప్రతి సంవత్సరం కూడా ఎదుర్కోవలసి వస్తుంది. అందు వల్ల ప్రభుత్వం ముఖ్యంగా P W D అధికారులకు ప్రత్యేకంగా ఇవ్వవలసిన nstructions ను Priority ఇచ్చి ముఖ్యంగా ప్రాజెక్టులను అమలుపెట్టడంకన్నా మురుగునీటి పథకాలను అమలు జరిపేటటువంటి చర్యలకై ముందు పూనుకోవాలని P W D అధికారులకు హెచ్చరిక చేయవలసిన అవసరం ఎంతగానో ఉంది. నాకు తెలిసినంతవరకు మాగుంటూరు జిల్లాలోనే 15 గ్రామాలకు సంబంధించినటువంటి Drainage Schemes 3 - 4 సంవత్సరముల క్రిందటనుంచి కూడా petitions, representations పెట్టినప్పటికీ, ఇప్పటికికూడా అవి dispose కాకుండా, అవును, కాదు, ఇది ఫీసిబిలు ఇది ఫీసిబులు కాదు ఈ పథకాన్ని అమలు చేస్తాము. చేయడంలేదు. దీన్కి ఇంతడబ్బు కావలెను. అని చెప్పుతూ రైతులకు జవాబుగా అయినా ఇంతవరకు రానటువంటి instances అనేకమున్నవని ప్రభుత్వ దృష్టికి తీసుకొని రావలసివచ్చింది. ఈ విషయాన్ని ప్రతి Budget సమావేశంలో కూడా, ప్రతి సంవత్సరమూ కూడా హెచ్చరిక చేస్తూనే ఉన్నాము. ఆమాంద్యం P W D అధికారులలో, ఆ department లో అప్పటినుంచి ఏమాత్రం మెరుగ్గా లేదని చెప్పడానికి మాత్రం విచారిస్తున్నాను. ముఖ్యంగా హరిజనులకు ఇండ్ల స్థలాల నిచ్చే విషయంలో కేవలం హరిజనులకు ఇవ్వనున్నందులకు చాలా సంతోషం. హరిజనులతోపాటు ఇతర కులాలవారికి కూడా, కులము గోత్రమూ వీటితో నిమిత్తం లేకుండా కేవలం poverty నే, పేదతనాన్నే ప్రాతిపదికగా తీసుకొని, ఇల్లు వాకిలి పొలం ఏవిధమైన ఆధారం లేనట్టివారికి ఇండ్లస్థలాలను ఉచితంగా ఇచ్చేటటువంటి విధానాన్ని అమల్లోపెట్టవలసిందనీ వార్కికూడా ఈ పథకాన్ని విస్తరింప చేయవలసిందని నేను ఈ ప్రభుత్వానికి సవినయంగా మనవి చేస్తున్నాను.

ఈ ఎలక్ట్రిసిటీ పథకాలను అమలుజరిపేటటువంటి విషయంలో ఈ సంవత్సరం ఎన్నో గ్రామాల్లో విద్యుచ్ఛక్తిని ప్రభుత్వం సప్లై చేసినట్లు గవర్నరుగారు చేసినటువంటి ప్రసంగంలో ఉన్నది. దానికి చాలా ఆనందించవలసి ఉన్నది. కానీ విద్యుచ్ఛక్తికి సంబంధించినంతవరకు లక్షలాది స్కీములు saction కావడం మాత్రమే జరుగుచున్నది. కాని ఒక సంవత్సరం, రెండుసంవత్సరాలనుంచి కూడా sanction అయిన స్కీములు అమలు జరగడం చాలా మందకొడిగా సాగుతున్నాయి. దానికి ప్రత్యేకమైన కారణం కేంద్రప్రభుత్వం మనకు రావలసినటువంటి మొత్తాన్ని మనకు sanction చేయకపోవడంవల్లనే అమలు జరగడంలేదని చెప్పి విద్యుచ్ఛక్తి

శాఖా మంత్రిగారు కూడా చెప్పుతున్నారు. ప్రత్యేకంగా నేను క్రిందటిసారి గూడా మనవిచేసి ఉన్నాను. తెనాలి కొల్లిపరస్కీము,—తెనాలి—రేపల్లి స్కీము, ఈ విద్యుచ్ఛక్తి ప్రకాశికలు ఎన్నాళ్లగనో ఎన్ని సంవత్సరాలుగనో అక్కడ ఉన్నటువంటి ప్రజలు ఆందోళన చేస్తున్నారు. అయినప్పటికి ఇప్పుడు sanction అయి అమలు జరుగకుండా అవి నిలబడి పోవడంకూడా చాల విచారకరంగా ఉన్నది ఏనాడు sanction అయి అమలు జరుగుతవో ఆనాటినుంచి కూడా ఆస్కీములవల్ల ప్రత్యేకంగా ప్రభుత్వానికి ఖర్చుపెట్టిన మొత్తానికంటే కూడా దానిమీద ఎక్కువ ఆదాయం వస్తుందని నేను ఘంటాపథంగా చెప్పగల స్థితిలో నున్నాను కాబట్టి అటువంటి రెమ్యూనరేటివ్ స్కీముల నైనా, ప్రభుత్వ ఆదాయ దృష్టిలో నైనా గాని వెంటనే అమలు జరిపించవలసిందని నేను ప్రభుత్వానికి విన్నవిస్తున్నాను

Sri D. SREERAMA MURTHY అధ్యక్ష మహాశయా

Local Boards లో జరుగు అన్యాయాలలో కొన్ని సూచిస్తున్నాను Election లు ఎన్నో రకాలుగా జరుగుతున్నాయి అక్కడ Dy Panchayat officersజిల్లా పంచాయతీ ఆఫీసర్లుసి క్యమైపోయి, వాళ్ల గ్రామాలలోనే పార్టీలను లేవదీసి లంచగొండితనం ఎక్కువై వారికి interest గల పార్టీకి వారి ఇష్టమొచ్చినట్లు ఉపకారాలనుచేసి తక్కిన పార్టీలను త్రొక్కి పెట్టుతున్నారు వారు ఇష్టమొచ్చినట్లు కార్యక్రమాలను — ప్రజలు ఆందోళన చేసినప్పటికీకూడా, వారు ఇష్టంవచ్చినట్లు పోస్టుపోను చేస్తున్నారు పంచాయితీ ప్రెసిడెంట్లుగానీ, మెంబర్లుగానీ, వారు వేసిన గుమస్తాలకు పని తెలియదంటూ వెళ్లి చెప్పినచో వారిని, వారి ఇష్టంవచ్చినట్టుగా చాలా అగౌరవంగా మాట్లాడుతునారు. అందుచేత అటువంటి సిబ్బందిని వేసేదానికన్నా trained people ను వేసి, పనులను చక్కపెట్టి funds ను సక్రమంగా ఖర్చుపెట్టేటట్లు, సరిఅయిన పద్ధతిలో పెట్టమని గవర్నమెంటును నేను కోరుతున్నాను. కనీసం ఒక పారశాలనైనను పెట్టి అందులో ట్రైనింగు 6 మాసాలైనను ఇప్పించి ఆ ట్రైనింగు అయిన people నే వేసినట్లయితే, ప్రస్తుతం ఎన్నికలు జరిగి నడుపబడుతున్న పంచాయితీలకు కొంతదోవ కల్గుతుంది ఈ కొత్త పంచాయితీలకు ఆ గ్రామాల్లోని రెవెన్యూ income లో ఏమైనా కొంత పెట్టుబడి పెట్టి రికార్డు నడిపించే లాగుంటే ఆ పంచాయితీలు ముందుకువచ్చే అవకాశముంటుంది. లేనిచో అవి అధోగతి పాలు కావలసి వస్తుంది. అందుచేత గవర్నమెంటు వారు ఇటువంటి విషయాలను ఆలో

వించి పంచాయితీలను ముందుకు తీసుకొని రావాలంటే trained people ను వేయవలెను. వాటిని సగౌరవ పద్ధతిలో పెట్టి నడిపించమని కోరుతూ ఇంతటితో నేను విరమిస్తున్నాను.

Sri P. KODANDARAMAYYA అధ్యక్షా, గవర్నరుగారు ప్రభుత్వం యొక్క విధానాన్ని తెలియజేస్తూ చేసినటువంటి ప్రసంగాన్ని నేను పరిపూర్ణంగా ఆమోదిస్తూ చిన్న చిన్న విషయాలను గురించి ఇక్కడ కొంత చెప్పడం అవసరమని మనవి చేస్తున్నాను. మన దేశంలో రాష్ట్రాలను ఏర్పాటుచేయడం విషయమై లోగడనే నా అభిప్రాయన్ని చెప్పాను. హిందూదేశం ఇన్ని states గా ఉండడం కంటే, ఇండియా అంతా ఒకే state గా ఉండడం చాల మంచిదని నేను అభిప్రాయపడుతున్నాను.

తిరువాత ముఖ్యముగా ఈ మధ్య వారం పది రోజులు, రాత్రింబవళ్లు మనస్థిమితం లేకుండా పడినబాధ విషయంలో గవర్నరుగారు ఒకమాట చెప్పారు. గోదావరి వరద తగ్గుతూంది సంతోషమన్నారు అందుచేతనే నేను ఇక్కడికి వచ్చి మీ ముందు నిలిచి మాట్లాడుటకు సావకాశం చిక్కింది. లేకపోతే ఈ శాసన సభకు రాకుండా ఆ గోదావరి వరద బాధితులతో నేను కూడా పడి ఉండాల్సిన అవసరం ఉండేది. ఈ గోదావరి వరదలు ప్రతి సంవత్సరం ఇట్లు రావడం, వస్తుందేమోనన్న ఆతృతతో, భయంతో ప్రజలెల్లప్పుడూ ఈలాగా ఉండవలసిందేనా? ఈ నవీన కాలంలో. సరే ఎంతో కాలంనుంచో గోదావరి ప్రవహిస్తూంది. ఆ ప్రక్కనే నివసిస్తున్నాం. ఆ బాధలనన్నిటినీ పడుతూనే ఉన్నాం. కానీ ప్రపంచంలో నాగరికత హెచ్చింది. అన్నివిధాల దేశాలు అభివృద్ధి చెందుతున్నవి అట్టి పరిస్థితులలో ఈ సమయంలో 1953 వ సంవత్సరంలో వచ్చిన వరదల అనంతరం కూడా ప్రభుత్వం తగు చర్య తీసుకోలేకపోయినందులకు చాల విచారపడుతున్నాను. అయితే వరదలు వచ్చిన తరువాత మాత్రం చాల సహాయం చేస్తున్నారు.

అయితే మరల వరదలపాలై మరల నష్టపడవలసిన అవసరం రాకుండా వుంచే విషయంలో వారు చేయవగిన పనిని చేయలేరు. చెయ్యడంలేదు. Central Government వరద నివారణ కోసమై ప్రత్యేకించి చాలా డబ్బును ఏర్పాటు చేశారు. ఏర్పాటు చేసినటువంటి డబ్బు విషయంలో పూర్తిగా ఒక చీఫ్ ఇంజనీయరుగారి మీదనే దానిని వదలిపెట్టే దానికంటే ఈ ఉభయ గోదావరి జిల్లాలలో వచ్చునటువంటి

వరద నివారణకై ప్రత్యేకించి ఒక Sub-Division ను ఏర్పాటుచేసి దాన్ని పూరిగా
విచారణచేసి, పథకాన్ని తయారుచేసి ఏర్పాటులు చేయడంకోసం ఒక Sub Division
న్ను ప్రభుత్వం నియమించి ఉంచే బాగుండేది కొంతకాలంవరకూ ఈ రెండు
మూడు సంవత్సరాలనుంచీ ఎలా ముంపు వస్తున్నది, ఎటువంటి నష్టాలు కలుగు
తున్నవి, అనే విషయాలను పరిశీలింపవలసిన అవసరం ఉంది ఈ వరదబాధితుల
సహాయార్థము ఇండ్లుపోయిన దానికైతేనేమి, ఇతరంగా ఇచ్చిన దానికైతేనేమి రెమి
షన్‌గా ఇచ్చినదానికైతేనేమి, వాటిని అన్నిటిని కలిపితే ఈ పాటికి ఒక Sub-Division
maintain అయి దానియొక్క కార్యకలాపాలు జరిగి ఉండేది ఇందాక సభ్యులు
అద్దేపల్లి సత్యనారాయణమూర్తిగారు చెప్పినారు——.

కోటానుకోట్ల రూపాయలు మురిగిపోతూ వుంటాయి ఇతర ప్రాంతాల
లో కోట్లు ఇతర నదులకు ఖర్చుపెట్టుతూనే వున్నారు. గోదావరికి మాత్రం
జరగడములేదు. ఆ జిల్లాలో జరిగే పథకం కోసము ప్రత్యేకించి ఒక ఋణము
ఏర్పాటుచేసి అక్కడి వరద నివారణ కోసము దానిని వినియోగించితే చాలా బాగుం
టుంది జీవ్రేకు పడపి కాల్వల ప్రాంతములో వుండేటటువంటి వారు నిత్యము
ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని కాలక్షేపము చేయవలసి వస్తుంది. వర్షము కురువక
పోతే వర్షంకోసము దేవునిని ప్రార్థిస్తుంటాము. వర్షము కురిస్తే వరదలు ఎప్పుడు
వచ్చి పడుతాయేమోనని టెలిగ్రాములమీద టెలిగ్రాములు యివ్వడము జరుగుతుంది.
యీ బాధ పడకుండా వుండడానికి ప్రభుత్వము వరద నివారణ నిధిని ఏర్పాటు చేయ
వచ్చును. వాస్తో కూస్తో వున్నవారు వుంటారు అద్దేపల్లి సత్యనారాయణమూర్తి
వంటివారు చాల మంది వున్నారు. Loan యివ్వడానికి ఏమి అభ్యంతరముండదు.
యీ మాదిరిగా loan float చేసి ఐనా యీ వరద నివారణచేయడము చాల అవ
సరం త్వరగానే మనము హైదరాబాద్‌తో కలుస్తున్నాము. అక్కడకు వెళ్లిన
తర్వాత ఏలా వుంటుందో చెప్పలేము మీరేమో గోదావరికి ఒకచోట డామ్ కట్టాలం
టున్నారు. మన వారేమో ఇంకొకచోట కట్టాలంటున్నారు. యీలాంటి సంద
ర్భంలో ఒకచోట కట్టేదానికంటే అక్కడక్కడ కట్టితే బాగుంటుంది. శబరి, ఇంద్రా
వతి యిత్యాది నదులు వున్నాయి. యీ నదులకు చిన్న చిన్న ఆనకట్టలు కట్టినట్లైతే
యీ వరదలు ఎక్కువగా రావడానికి వీలుండదు. "ఖోస్లా కమిటీ వారు కూడా యీ
మాదిరిగనే రెకమెండ్ చేశారు. వారి పథకాన్ని మళ్లీ పరిశీలనచేసి గోదావరి ఉప

నెదులకు ఆనకట్టలు కట్టడం చాల అవసరమని కోరుతున్నాను. దీనికి తగిన చర్యలు తీసుకోవాలని కోరుతూ యీ సందర్భములో నాకు మాట్లాడడానికి అవకాశమిచ్చినందులకు నా హృదయ పూర్వక నమస్కారాలు.

Sri T JIYYAR DAS అధ్యక్షా, ఆంధ్ర గవర్నర్‌గారి ప్రసంగముపై అభినందన ప్రత్యేకంగా తెలుపవలసిన విషయమే. కారణమేమిటంటే ఆంధ్ర గవర్నర్‌గారు ఒక నూతనమైన సంప్రదాయాన్ని సృష్టించారు. ఒకవైపున మన బెంగాల్ గవర్నర్ భౌతిక దేహమును ఛితిలో ఉంచుచున్న సమయంలో ఆయన తన ప్రసంగాన్ని చక్కని మాటలలో ధ్వనింపజేశారు మనకిచ్చుట బహుశా వారికి ఒక ధైర్యాన్ని కల్గించి వుండవచ్చును. "జాతస్యోహి ధృవో మృత్యుః" అన్న సూత్రము ఈ నూతన సంప్రదాయం ప్రకారం ఆఫీసులన్నీ మూసివేయవలెనుగాని అసెంబ్లీ మాత్రం close చేయడం అవసరంలేదని అనుకొని వుండవచ్చును. దీనికి నేను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను

The Hon. Dr. B. GOPALA REDDI. పార్లమెంటు కొంతకాలము సాగింది. మద్రాస్ అసెంబ్లీ కూడా సాగింది ఇక్కడ అన్ని శాఖలకు 12 గంటలైన తర్వాత శెలవు యిచ్చివేశాము.

Sri T JIYYAR DAS. అట్టి కార్య దీక్షతకుకూడా కొంత ధైర్యముండాలి. అందుకు వారినందరిని అభినందించుచున్నాను. వారు మొదటి పంచవర్ష ప్రణాళికను గురించి ద్వితీయ పంచవర్ష ప్రణాళికను గురించి ప్రస్తావించారు. యీ రెంటిని గురించి ప్రస్తావించినప్పుడు వ్యవసాయ రంగములో ఉత్పత్తిజాస్తి అయినదని చెప్పారు. వ్యవసాయ వస్తువులకు ముఖ్యంగా వడ్లకు చాల హెచ్చుధర వుంది పేదవారు మాత్రము వాటిని కొనుక్కునే పరిస్థితిలో లేరు అని వారు గ్రహించి వుంటారనుకొంటాను ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో మనము చూచినట్లైతే పేదవానికి అంటే వ్యవసాయ కూలీకి మోక్షము వుందా అనిపిస్తుంది. గవర్నర్‌గారి ఉపన్యాసంలో ఇది చాలా వ్యంగ్యంగా వుంది ఇటువంటి ప్రణాళికలు 5 దాటిపోయిన తర్వాత అంటే 25 సంవత్సరాల తర్వాత కూడా వీరికి ముక్తి కల్గుతుందా అనే నిరాశ వుండవచ్చును. రోడ్లను గురించి వారు చెప్పుతూ రోడ్లయొక్క అభివృద్ధి కోసము కేటాయించిన డబ్బులోనుంచి 10% మాత్రము District Board రోడ్లకోసం కేటాయించారు అది అదనపు సౌకర్యమని చెప్పారు బహుశా District Board

రోడ్లపై మంత్రులు వెళ్లివుండక పోవచ్చును. కాని సభ్యులు ఇతర అధికారులు చాలా మంది ప్రయాణం చేసివుంటారు. వాటి పరిస్థితి చూస్తే యీ 10% చాలదు. దానికి ఏదైనా ఒక మార్గము ప్రత్యేకంగా కనిపెడితేగాని ఆ రోడ్లు బాగుపడవని మనవి చేస్తున్నాను తరువాత మన ఆర్థిక పరిస్థితిని గురించి వారు చెప్పారు. పదే పదే మన ముఖ్య మంత్రిగారుకూడా మనకు జ్ఞప్తిచేస్తూ వుంటారు అటువంటి దుర్భర పరిస్థితులలో వుండే సమయంలో Employment Exchange అనే శాఖను మన ప్రభుత్వమువారు కైవశము చేసుకుంటున్నారని గవర్నర్‌గారి ప్రసంగములో వుంది. నిజంగా దీనిని హర్షించవలసినదేనా ? మనకుండే పరిస్థితులిటులుండగా ఈ శాఖ కయ్యే 60% మాత్రము Central Govt. వారు 40% మనకు యివ్వడానికి పూను కుంటున్నారు. ఇది పూర్వమునుంచి వున్నపద్ధతే. క్రొత్తగా వచ్చిన పద్ధతేమి కాదు. ఐతే అనవసరంగా ఎందుకు యీ డిపార్టుమెంటును మన ప్రభుత్వంవారు తీసుకుంటున్నారో నాకు అర్థంకావడంలేదు. ఇది బహుశా శివరావు కమిటీ నివేదికను బట్టివుండవచ్చును ఆ నివేదికలో మొట్టమొదటి సిఫార్సు "Employment organisation should be placed on a permanent footing without further delay" అని ఈ నాటికికూడా Central Govt. క్రింద పనిచేస్తున్న ఈ శాఖకు ఒక విధమైనటువంటి స్థిర స్వరూపములేదు దీనిని స్థిరాకరణ చేయమని వారుచేసిన రెకమెండేషన్ మొట్ట మొదటిది ఆ రెకమెండేషన్ ప్రకారమే ఇపుడు Central Govt వారు State Govts కు వాటిని ఒప్పగించుచున్నారు. ఈ భారాన్ని మాత్రము మనము అంగీకరించ లేము. Premanent చేయుచు ఈ శాఖను నిర్వహించగలమా? లేదా? అనేది మాత్రము ప్రస్తావించుకోవలసి యున్నది. ఇటీవల party meeting లోను executive meeting లోను కూడా క్రింది ఉద్యోగులందరికి త్వర త్వరగా promotions పొందు టవలన మన State Govt. లో ఎక్కువ increments తీసుకోవడంచేత మనము అనుకున్నటువంటి లోటు ఒక కోటినుండి ఇంకొకకోటి అధికమగుచున్నదని మన ముఖ్య మంత్రిగారు శెలవిచ్చారు ఈ డిపార్టుమెంటుకు పురోభివృద్ధి ఇంతవరకూ ఏమీలేదు కారణమేమిటంటే—ఇపుడు మన ఆంధ్ర State యొక్క employment ఉద్యోగులను తీసుకోండి ఆంధ్ర స్టేట్‌లో వున్నటువంటి గొప్ప ఉద్యోగి Sub-regional Employment Officers, మాత్రం అటువంటివారు ముగ్గురు మాత్రము వున్నారు. ఈ ఆంధ్ర స్టేట్ మొత్తముమీద మిగిలినటువంటివారు అనగా Asst. Employment Officers లేక District Employment Officers వుంటారు వారు 11 మంది

మాత్రమే. ఈ 11 మందికి పై ఆఫీసర్లు 3గ్గురికీ సర్వీస్ ఇంచుమించు 2-3 సంవత్స రాల వ్యత్యాసముతో ప్రారంభమై వుంటుంది. Sub-Regional Employment Officer అయినవానికి ఇంకొక cadre లేని కారణంచేత అతనికి పైకి పోవడానికి అవకాశం లేకుండా వుంది ఇక District Employment Officer గా service ప్రారంభించిన వాడు promotion మీద Sub-Regional Employment Officer గా వెళ్లాలి. Sub-Regional employment posts మూడుమాత్రమే. ఆ ముగ్గురు ఇప్పుడే retire కారు. అందు వల్ల ముందుకు పురోగమించడానికి వీలు లేని, వెనుకకు తగ్గుపేయడానికి వీలుగాని సంస్థ ఇది ఐతే వారిని permanent చేయమని సిఫార్సుచేసి వున్నారు ఇతర డిపార్టుమెంటులలో clerk గా start అయిన వాండ్లు Asst Secretaries, Deputy Secretaries అయ్యే విశేష అవకాశాన్ని పొందుతున్నారు.

రెండోది. ఇపుడు ఇది సెంట్రలు గవర్నమెంటు క్రింద పని చేస్తున్నది. సెం ట్రలు గవర్నమెంటు క్రింద పని చేసేటప్పుడు మనకు స్టేటులో ఉండే చిన్న చిన్న ఉద్యోగాలన్నీ కూడ ఈ employment exchange ఆఫీసు వాండ్లకు మార్పు చేస్తాము. Employee కి employer కు మధ్య పనిచేస్తుంది ఈ ఆఫీసు. ఈ శాఖకు ఒక statutory right గాని, తమంతటతామే ఉద్యోగాలిచ్చే అధికారంగాని లేదు. సెంట్రల్ గవర్నమెంటు క్రింద పనిచేస్తూ ఉండే ఈ సంస్థకు అందు పనిచేయు అధికా రుల మీద మన నాయకులు, పెద్దలు, ఏదో అపత్కాలమందు మేము పంపించే candidate కు సహాయంచేయవలసిందని ఒత్తిడి తీసుకొని రావడం సహజమైన విష యమైనది ఇటువంటి విషయంలోనే మన Public Service Commission కూడ మినహాయింపబడిన సంస్థ కాలేదు. Public Services Commission Officer ఈ గోడ చాయకు రాకూడదు. ఈ గుమ్మం దగ్గరకు రాకూడదు అని బోర్డులు ఉన్న ప్పటికిని వాండ్లను కూడా మనం ఒత్తిడిచేసేటటువంటి అసహజమైన స్థితిని కలిగి ఉన్నాము.

Central Government క్రింద పనిచేస్తూ ఉంటేనే మన యొక్క ఒత్తిడి చిన్న చిన్న ఉద్యోగాలకు employment ఉద్యోగస్థుల మీద వస్తుందే: రేపటినుంచి వీరు మన క్రింద ఉండే సందర్భంలో ప్రతి M L. A. ప్రతి Minister ప్రతి ఉద్యోగి వెళ్లి వారిని మా candidate ను మీరు నియమించేటట్లు చేయకపోయినట్లయితే, ఆ employment officer ను transfer, లేక ఉద్యోగమునుండి తీసివేసేటటువంటి

దుర్గతులకు పాలుచేస్తామనే భయంలేకుండా పోలేదు అంతే కాకుండా Central Government వారు ఈ ఉద్యోగస్తులను state government లకు transfer ను చేస్తా అంతా మొన్ననే, జూలై 31 లేదిన, Delhi లో ఉన్న Director General "October ఒకటవ తేదినుండి, ఈ ఉద్యోగాలు తమ క్రింద ఉండవని. కొంత మంది ఉద్యోగుల సర్వీసులను మాత్రము abolish చేస్తున్నామని under such transferred conditions, ఈ క్రింది సదుపాయాలు మాపిస్తున్నామని" చెప్పి మూడు నెలల నోటీసు ఇచ్చారు పైన ఏమో కొంత మందిని abolish చేస్తున్నామని వ్రాశారు క్రిందను మీ సర్వీసులు transfer అవుతున్నాయని వ్రాస్తూ ఆ transfer conditions లో మాత్రం వాండ్లకు ఉండే employments ను గురించిగాని status ను గురించిగాని వాండ్ల salaries ని గురించిగాని permanancy ని గురించి గాని చెప్పరు ఆ నోటీసులో వాండ్లకు ఏమి చెప్పినారంటే, వారికి accrue అయిన శెలవును గురించి, allowances ను గురించి మాత్రం చెప్పినారుగాని, salaries ను status ను గురించి సుతరాము చెప్పలేదు ఇప్పుడు ఈ ఉద్యోగస్థుల స్థితి సందిగ్ధావస్థలో ఉంది దీనివల్ల హైదరాబాదు స్టేటులో ఉన్న employement ఆ department, ఇతరులు కూడ తిరుగుబాటుచేసి మన ప్రెసిడెంటుకు appeal పంపించుకొన్నారు. అదే కాకుండా మద్రాసు రాష్ట్రములోనివారు కూడ రేపు పండిత్ నెహ్రూ వద్దకు రాయబారము వెళ్ళనున్నారు ఎవరు ఎట్లా చేసినప్పటికిని మన ఆంధ్ర స్టేటుకు సంబంధించినవరకు, మనకు ఉన్న ఆర్థిక దుస్థితిని బట్టి ఈ సంస్థను కైవశముచేసికొని మనము నిర్వహించగలమా అనే సందేహాన్ని ముఖ్య మంత్రిగారు ఆలోచిస్తారని ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను

Sri M NAGI REDDI అధ్యక్షా. విశాలాంధ్రకు వెళ్లనున్నటువంటి తరుణంలో చివరి ఉపన్యాసంగా గవర్నరుగారి ఉపన్యాసం ఈ శాసన సభలో చేయబడింది. ఈ నాడు ఆంధ్రదేశాన్ని ఎదుర్కొంటున్న అనేక సమస్యలపైన ఒక పరిష్కార మార్గాన్ని ప్రభుత్వం గవర్నరుగారి ఉపన్యాసంద్వారా లభిస్తుందనే టువంటి ఆశతో మనమందరము ఎదురుచూచాము. కాని మొత్తం ఉపన్యాసం చూచినపుడు ఏదో జమా ఖర్చుల పట్టికలాగా ఇది చేశాం, ఇది చేయలేదు అనే పైపునుంచి తప్పితే ప్రధానమైన సమస్యలను పరిష్కారం చేయడానికి ఒక సూచన మార్గంగా, తాము ఏమిచేయబోతుంది అనే విషయాన్ని ఇందులో పేర్కొనలేదనే విషయం స్పష్టంగా కనబడుతుంది. ఇప్పుడు భూసంస్కరణల విషయమై ఎన్నో సంవత్సరాలనుంచి రావాలన్నది, కాంగ్రెస్ కరకు ఇప్పటికి ఏకాంగ్రెసు ప్రభుత్వమైతే ఇక్కడ

ప్రభుత్వ పక్షంలో ఉండి అధికారంలో ఉంటే ఆ కాంగ్రెసు పక్ష ప్రభుత్వమే కేంద్రంలో అధికారంలో ఉంది, ద్వితీయ పంచవర్ష ప్రణాళిక జయప్రదమ కావాలన్నప్పుడు భూసంస్కరణలను వెంటనే ప్రవేశపెట్టాలి. ఇప్పటికే చాల ఆలస్యం అయింది. ఇదివరకు పెట్టినటువంటి రాష్ట్రములు కూడ వెంటనే చర్యతీసుకోవాలి దానికి సూచన ప్రాయంగా ఒక్కొక్క కుటుంబానికి కమతాన్ని ఒక పరిమితిగా తీసుకొని ఆ కుటుంబ క్షేత్రానికి, 12 వందల రూపాయల నికరాదాయం గాని 16 వందల రూపాయల ఖర్చులతో కూడిన ఆదాయంగాని వచ్చేటటువంటిది ఒక కుటుంబ క్షేత్రంగా నిర్ణయించి, మూడు కుటుంబ క్షేత్రాలను గరిష్ట పరిమితిగా నిర్ణయించి ప్లానింగ్ కమిషన్ సూచనను ఇచ్చింది, వాటిని దృష్టిలో పెట్టుకొని అయినాసరె, భూసంస్కరణలు, అమలు చేయడానికి చాలా రాష్ట్రాలు ముందుకు రాలేదు వచ్చిన రాష్ట్రాలుకూడ అవి క్రమంగా execution లో పెట్టలేదు అనే ఆక్షేప విమర్శన planning కమిటీ ఒకవైపున చేస్తున్నది రెండవవైపున అమలు పెట్టకపోగా అమలు పెట్టడానికి కూడ మనప్రభుత్వం అంగీకరించడం లేదనేది స్పష్టంగా కనబడుతుంది. ఒకవైపున మనము విశాలాంధ్రకు పోబోతూ ఉన్నాము. ఎన్నో సంవత్సరాలుగా fuedal state గా తరతరాలుగ బ్రిటీషు సామ్రాజ్యవాదుల పరిపాలనలో fuedal సంస్థానంగా ఉన్నటువంటిది. మనకంటె సంవత్సరమో, రెండు సంవత్సరములో వెనుకగా అసెంబ్లీలు, ప్రభుత్వం వచ్చినటువంటి హైదరాబాదు సంస్థానంలోనే ఒక రకమైన భూసంస్కరణలు తీసుకొనివస్తే, కవులుదారిచట్టం తీసుకొనివస్తే, ఇక్కడ వచ్చేటప్పటికి మాత్రం మనం కలవబోయే విశాలాంధ్రలో భాగంగా ఉండే, హైదరాబాదు రాష్ట్రంలో వచ్చినటువంటి భూసంస్కరణలు అయినా తీసుకొని, వీటిమేరకైనా, లేక ప్లానింగు కమిటీ మేరకైనా ప్రభుత్వం పూనుకొంటుందా అంటే అది పూనుకోవడంలేదనేది స్పష్టంగా ఉంది. అయితే విచిత్రమైన విషయం ఏమిటంటే ఒకవైపున వ్యవసాయ కూలీల ప్రతినిధిగా వారి విషయం మాట్లాడే ప్రభుత్వపక్ష సభ్యులుకూడ, Namburi Sreenivasa Rao లాంటి వాండ్లు ఈ భూసంస్కరణలు తీసుకొనివస్తే వ్యవసాయ కూలీల సమస్య పరిష్కారంకాదు. కనీసవేతనం నిర్ణయించితే పరిష్కారం కాదు; తొమ్మిది నెలలు పనిలేకుండా ఉంటున్నారు అని చెప్పుతూ దానికి పరిష్కారమార్గం ఏమి చెప్పకుండా, భూసంస్కరణలు, కనీస వేతనాలు, పరిష్కారం చేయవని అంటూ Gopalareddi గారి ఎదుటగాని, మంత్రివర్గం ఎదుటగాని మాట్లాడారంటే యిది చాలా అన్యాయం. వెనుకబడినటు

వంటి వ్యవసాయ కూలీల ప్రతినిధులమని చెప్పుకొనునటువంటి ప్రభుత్వపక్ష సభ్యులు అయినను, ఒత్తిడి తీసుకొనివచ్చి వాండ్ల పార్టీ తరపున పరిష్కరించడానికి ముందుకు రాకపోవడం చాల విచారకరమైన విషయం అని భావిస్తున్నాము వ్యవసాయ కూలీల కనీసవేతనం విషయం వచ్చినపుడు, కనీసవేతనం 12 అణాలని నిర్ణయించారు అచ్చన్నగారు సమాధానం ఇస్తూ అది ఏలా జరుగుతుందో పరిశీలిస్తున్నాము అని అంటూఉంటారు స్థానికంగా ఉండే రేట్లకంటే ప్రభుత్వం చాల ఎక్కువ ఇస్తూఉంటే, దానికంటే మించినదానిని ఒకవేతనాన్ని పెట్టి, దానిని అమలు పరచవలెననేది. వాండ్లఫ్యాక్టరీలో 12 అణాలు ఇస్తే కాదు—2 రూపాయలు ఇస్తేగాని జీవిత ప్రమాణం సరిపోదు—అని ఒక కనీసవేతనం నిర్ణయించారు కనీసవేతనం ప్రభుత్వాన్ని అడిగే విషయంలో అక్కడ స్థానికంగా ఉండే పరిస్థితులనుబట్టి దాని మీద ఒకపావలో, 2 అణాలో ఎక్కువఇచ్చి పరిష్కారం చేయడానికి బదులు 12 అణాలు కనీసవేతనం ఇస్తుంది. అదికూడ సక్రమంగా జరగడం లేదనేది ఈ వేళ చూస్తున్నాం. అనేక ఫ్యాక్టరీలలో కనీసవేతనం ఈ నాడు నిర్ణయించకపోవడం. ఈవేళ నా నియోజకవర్గమైన మాచర్లలో Ramakrishna & Company వారు Cement factory కట్టుతున్నారు. అక్కడ జరుగుతూఉందేది చూస్తే, కనీస వేతనములు, కూలీలు కాపురంఉండే గుడిసెలు మొదలైనవి విచారకరంగా ఉన్నది కూలీల విషయం వచ్చినపుడు, దళారీలను పెట్టడం కంట్రాక్టర్లను పెట్టడం, వాండ్లు ఒక్కొక్క మనిషివద్ద రోజుకు అణా Commission వసూలుచేయడం జరుగుతుంది పైగా ఇదిఅంతా కనబడుతుందేమోనని కనీసం muster rolls maintain చేసే పరిస్థితులలో కూడా ఫ్యాక్టరీలు లేవు. ఎందుకని అంటే, muster rolls ఉంటే, 5, 6 నెలలు పనిచేస్తే, సర్వీసు put up అయ్యేటట్లయితే, రేపు వీడు మళ్లా permanent కావలెనని అంటాడే అని ఒక నెలరోజులు ఉంచడంమో, మళ్లా తీసివేయడం జరుగుతుంది. మళ్లీ కొత్తవాడిని పెట్టడం, ఈవేళ, నాగార్జునసాగరు project విషయంలోకూడ మనకు కనబడుతూ ఉండేది ఇదే. పక్కా building లు అన్నీ ఒక్కసారి కట్టాలి అని మేము కోరడంలేదు. అది సాధ్యంకాదు. మొన్న మంత్రి నాగేశ్వర రావుగారు మాచర్లలో camp చేసినపుడు రోడ్డు ప్రక్కన ఇటుఅటు గుడిసెలు వేసి ఉంటే, అది ఆరోగ్యానికి భంగకరమైనది, కాబట్టి ఈగుడిసెలను తీసివేయవలెనని అంటూ ఉన్నారు. ఈవేళ వాండ్లు అక్కడికి ఎందుకువెళ్లారు ? Cement Factory రాబోతుంది, అచ్చట పనిచేసి బ్రతుకుతామని వెళ్లుతున్నారు. బ్రహ్మాండ

మైన నాగార్జునసాగరు నిర్మాణంకాబోతుంది. కాబట్టి దాని లోమనము పనిచేయాలి అనే సదుద్దేశంతో అందరూ పోతూఉంటే, అక్కడ పొయ్యేటప్పటికి వాండ్లకు వసతులు ఉండవు.

రోడ్లప్రక్కన గుడిసెలు వేసుకొని నివసించే పేదప్రజలను "మీరు గుడిసెలు తీసి, ఆప్రదేశం ఖాళీచెయ్యండి లేకపోయినట్లయితే పోలీసువారి సహాయంచేత మీ పాకలన్నీ పీకించేస్తాము." అని ప్రభుత్వం ఉత్తర్వుచేస్తుంది ఆ పేదప్రజలు అందుకు నిరాకరించినట్లయితే "మీరు కమ్యూనిస్టులు, destructive policy అవలం భించి గొడవ చేస్తున్నారు" అంటారు. ఈ విషయమై మాజిల్లానుంచి మహజర్లు పెట్టు కోబోతున్నారు. మాదగ్గర cement factory కడుతోంటే ఈ కూలీలంతా అప్పుడే దెబ్బలాడుతున్నారు, అభివృద్ధి అనేది జరగనీయరు. ఇదే కమ్యూనిస్టుల destructive policy అంటారు. ఆ కూలీలకు నివాసమునకు తగినప్రదేశం చూపించి అక్కడ గుడిసెలు వేసుకోమని చెప్పినట్లయితే బాగుంటుంది. వారికి నివాస సౌకర్యములు కల్గించే విషయంలో ప్రభుత్వంవారు ఏమాత్రం పూనుకోవటం లేదని తెలుస్తున్నది.

బంజరుభూముల సమస్య ప్రతిసమావేశంలో చర్చింపబడుతూనేఉంది. నెల్లూరు జిల్లాలోని 6 వేల ఎకరాల భూమినుండి రైతులను తొలగగొట్టుతున్నారు. గోపాల రెడ్డిగారు, కోటయ్యగారు, తదితరులమంతా కలిసి ఒక కమిటీగా ఏర్పడి ఒక నిర్ణ యానికి వస్తే, దానిని ఆచరణలో పెట్టి ఈ సమస్యకు పరిష్కారమార్గాన్ని అనుస రించుటకు పూనుకొనుటలేదు.

కొన్నిభూములకు పట్టాలు యిస్తున్నారు. బీదప్రజల విషయంలోమాత్రం 144 వ సెక్షను ఉపయోగిస్తున్నారు. భూములనుండి తొలగించేస్తున్నారు. ఈ సంవ త్సరంకూడా కొంతమంది సాగుచేసుకొంటున్నారు. పైరులు తయారయ్యేటప్పటికి ఏరాజకీయ బాధితులో వచ్చి ఇవిగో మాకు పట్టాలున్నాయి. ఈభూమి మాది అంటుంటే దానికి ఆరైతులు వ్యతిరేకిస్తే, అదిగో కమ్యూనిస్టులు మళ్లీ అల్లరులు చేస్తున్నారంటారు. ఈనాడు మంత్రులు ఎవరైనా వచ్చి పరిశీలించి ఆభూమి ఎవరిస్వాధీనంలో ఉందో తెలుసుకోవచ్చును. నెల్లూరు జిల్లాలోని చెరువులలో చేసుకొనే 10 వేల కుటుం బాలవారు రాంపేరు ప్రాంతంలో 5, 6 వేల కుటుంబాలవారు ఈ విషయంలో చాలా బాధపడుతున్నారు. భూసంస్కరణలు అమలులోకి తేవటంలేదు. బీదలకు ఇచ్చుట

లేదు. ఇంక Socialistic Pattern of Society అంటే ఏలా ఏర్పడుతుందో ప్రభుత్వంవారు ఆలోచించవలసియున్నది

గ్రామోద్యోగుల విషయంలో వారికి 5 ఎకరాలభూమి ఇవ్వాలని కొండయ్య చౌదరిగారు అన్నారు నా స్వానుభవమునుబట్టి వారితో నేను ఏకీభవించను. నేను మున్సబును గనుక నాకు ఆవిషయం కొంతవరకు తెలుసును

The Hon Dr B GOPALA REDDI నెల్లూరు మున్సబీ మాది

Sri M NAGI REDDI ఇప్పుడు మా అబ్బాయి మైనర్ డిప్యూటీ చేంజి

5 ఎకరముల భూమి గ్రామోద్యోగికి యివ్వడమనేది అసాధ్యమైన విషయం రాజకీయ బాధితులకు, బీదలకు ఇవ్వడానికి భూములు లేవని కాంగ్రెసువారు అంటుంటే ఇంకా గ్రామోద్యోగులకు ఇవ్వడానికి ఎక్కడనుంచి వస్తుంది ?

గ్రామోద్యోగుల సౌకర్యములను గురించి మేము పదే పదే ప్రభుత్వానికి తెలుపుతున్నప్పటికీ ప్రభుత్వం వినిపించుకోకపోవడం మూలాన ఇంతవరకు గ్రామోద్యోగులు సర్వార్జీ లెక్కలు తయారు చేయలేదు దీనిని గురించి తగు శ్రద్ధ తీసుకోవాలని మళ్లీ ప్రభుత్వమునకు మనవి చేస్తున్నాను పంచాయతీ బోర్డులకు కావలసిన staff వుంది. ఆ staff నంతా maintain చేయడానికి ప్రభుత్వానికి శక్తిలేదు. కాబట్టి గ్రామోద్యోగులకు వంశపారంపర్య హక్కు రద్దుచేసి, వారిని ప్రభుత్వోద్యోగులుగానే పరిగణించి, వారికి సరైన జీతాలిచ్చి వారిని clerical staff గా వుంచినట్లయితే బాగుంటుంది. ఇప్పుడు గ్రామంలో కరణం, మునసబు, నౌకర్లు మున్నగువారు మొత్తం 6గురు వున్నారు.

వీరందరికి ప్రభుత్వం 120 రు॥లు ఇస్తున్నది. ఈ staff నంతా పంచాయతీ బోర్డుకు బదిలీచేసినట్లయితే బాగుంటుంది ఏదైనా certificate కావాలని కరణం, మునసబులదగ్గరకు వెళ్లితే, వూళ్లోకి పార్టీల మూలంగా వారా Certificates ఇవ్వటం లేదు. వీరు certificates ఇవ్వక పోవటంవలన scholarships రాకుండా పోయిన విద్యార్థులున్నారు. పంచాయతీ బోర్డులకు revenue ఇచ్చి సర్దుబాటు చేసినట్లయితే సరిపోతుంది కాని 5 ఎకరముల భూమి యిస్తామన్నంత మాత్రాన వారి సమస్యలు పరిష్కారంకావు. ఇప్పుడు గ్రామోద్యోగుల పేరుతో ఆ భూములనుంచి బీదలను తొలగించడం న్యాయంకాదు.

కడప జిల్లాలోనూ మాచెర్లలోనూ, కర్నూలులోను సిమ్మెంటు ఫ్యాక్టరీలు న్నట్లు ప్రభుత్వం వారు చెబుతున్నారు. కాని కడపలో సిమెంటు ఫ్యాక్టరీలేదు. మాచెర్లలోని ఫ్యాక్టరీనే కడప ఫ్యాక్టరీ అని వ్రాయడం జరిగిందో లేక 3 వున్నాయో తెలియదు. నాగార్జునసాగర్ ప్రాజెక్టు దగ్గర ఒక సిమ్మెంటు ఫ్యాక్టరీ కట్టవలసి యున్నది. అదే విధంగా సిగరెట్టు ఫ్యాక్టరీ, ఎరువుల ఫ్యాక్టరీ, పొగాకు విషయంలో I L T D కంపెనీలను స్థాపించాలి. నాగార్జునసాగర్ నిర్మాణం విషయంలో ఏ విధంగా పొరపాటు జరిగిందోగాని "ఆంధ్రవైపు డాము నిర్మాణం పూర్తయింద"ని గవర్నరుగారి ఉపన్యాసంలో వుంది. ఆంధ్రవైపు అసలు పూర్తికానేలేదు

The Hon Dr B. GOPALA REDDI ఆంధ్రప్రదేశ్ ను దృష్టిలో పెట్టుకుంటే సరిపోతుంది

Sri M NAGI REDDI అయితే ఆఉపన్యాసం ఆంధ్రప్రదేశ్ లో చేయాలి. హైద్రాబాదు వైపు కొంతవరకు పూర్తయింది గాని, ఆంధ్రవైపు అసలు కాలేదు. నాగార్జున సాగర్ వద్ద ఇళ్లు కట్టే కార్యక్రమం సరిగా జరుగుటలేదు ఆ ప్రాజెక్టు నిర్మాణం విషయంలో ఈసంవత్సరం 1,80 లక్షల రూ॥లు ఖర్చుపెటుతోంటే మొత్తం 122 కోట్లు ఖర్చుపెట్టి పనిచేయడానికి ఎన్ని సంవత్సరాలు పడుతుందో ప్రభుత్వంవారు ఆలోచించవలసి ఉన్నది. పనులు చాలా మంద గమనంతో జరుగుతున్నాయి. అభివృద్ధి నేది ఏ మాత్రమూ కనిపించడం లేదని మరొక్కసారి ప్రభుత్వంవారి దృష్టికి తీసుకొని ఎస్తూ విరమిస్తున్నాను.

Sri P GUNNAYYA గవర్నరుగారు సుదీర్ఘంగా ఉపన్యసించినందులకు వారిని నేను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. ఇంతేకాకుండా వారి ఉపన్యాసమును తెలుగులో ఒక కాపీ పంచిపెట్టినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. రాయలసీమలోని వేమారెడ్డిగారు తీర్మానమును ప్రతిపాదించడం, దానిని అన్ని జిల్లాలలో కంటె వెనుకబడిన ప్రాంతంవారైన రంగబాబు అనే M. L A. చేత బలపర్చబడ్డం జరిగినందుకు ముఖ్య మంత్రిగారికి వందనము లర్పిస్తున్నాను. ఎంతో కాలం నుంచి వాంఛిస్తున్న వంశధార ప్రాజెక్టు నిర్మాణమును గురించి గవర్నరుగారు ఉపన్యాసంలో చెప్పినందుకు మరొకసారి గవర్నరుగారిని అభినందిస్తున్నాను.

వంశధార నదిపైన చెన్న గ్రామందగ్గర రిజర్వాయర్ కట్టడానికి ఒరిస్సా ముఖ్య మంత్రిగారితో సంజీవరెడ్డిగారు సంప్రదించి తగిన యేర్పాటుచేసినారని విన్నాము. తరువాత మళ్లీ అక్కడ మానేసి గొట్ట దగ్గర రిజర్వాయర్ ను నిర్మించడానికి నిర్ణయమైందని పత్రికలలో చదివాము.

శ్రీకాకుళం జిల్లాలో పాత పట్టణం తాలూకా చాలా వెనుకబడ్డది ఆ గొట్టి దగ్గర రిజర్వాయర్ కట్టినట్లయితే 30 వేల ఎకరాల భూమి మునిగిపోతున్నది.

ప్రజా ప్రభుత్వమైన గోపాలరెడ్డిగారి ప్రభుత్వంలో ఎవ్వరికీకూడా అన్యాయం జరగనీయరాదని కోరుతున్నాను

లక్ష్మణదాసుగారు, నేను ఆ, నియోజక వర్గంనుంచి వచ్చాము. మా ఊళ్లే ముంచి వేయడానికి ప్రభుత్వము పూనుకొంటోంది కాబట్టి దానిని గురించి ఆలోచించి నెన్నా నగరం దగ్గర రిజర్వాయర్ కట్టి ఆంధ్రకు ఒక భాగము, ఒరిస్సాకు ఒక భాగము వెళ్లేటట్లు వేయడంగాని లేక అక్కడే regulator ను కట్టి వంశధారను శ్రీకాకుళం జిల్లాలో, టెక్కలి తాలూకాకు ఇప్పించేటట్లు ప్రభుత్వము చేస్తారని మనవి చేస్తున్నాను. మంత్రిగారు పై బిల్లు ప్రవేశపెట్టినప్పటికి మేమంతా బలపరుస్తున్నాము. కాని ఆ డబ్బును దుర్వినియోగం చేయకుండా సద్వినియోగం చెయ్యాలని మంత్రిగారికి ప్రతిఒక్కరము చెపుతున్నాము కోట్లకొలది, లక్షలకొలది డబ్బుపెట్టి సిమ్మెంటు రోడ్లు వేస్తున్నారు. రోడ్లే లేవని చాలమంది చెపుతున్నారు మొన్ననే ఈ మధ్య మంత్రిగారు గొడుగు పేటలో తనిఖీచేసి వెళ్లినపుడు వారు కూడా వెళ్లలేవని చాలమంది చెప్పారు అటు వంటప్పుడు సిమ్మెంటు రోడ్డు తాలూకు డబ్బు తగ్గించి రోడ్లు లేనిచోట్ల రోడ్లు వేయాలని కోరుతున్నాము. వంశధార కడితే 9 కోట్లు అవుతుంది ఏవో కొన్ని గ్రామాలకు నీరు వెడుతుంది కనీసము మా జిల్లాలోని బత్తైనగడ్డ ప్రాజెక్టుకు రెండు లక్షల రూపాయలు ఖర్చుపెడితే 10 వేల ఎకరాలు తడుస్తుంది బట్టివేల గడ్డ ప్రాజెక్టు రెండు లక్షల రూపాయలని estimate లో ఉన్నది దీనివల్ల 5 వేల ఎకరాలు కలుస్తుంది అట్లాగే బాహుదా నది scheme ఉన్నది. అది ఒక గొప్ప జీవనది దానికి ఒక కోటి రూపాయల లోపు ఖర్చుపెడితే అది ఒక తాలూకాకు ఉపయోగపడుతుంది. అలాగే పాడిగాము స్కీము. దీనికి కనీసము 56 లక్షల రూపాయలు ఖర్చు పెట్టినట్లయితే 20, 30 వేల ఎకరాలు తడుస్తుంది. పార్వతీపురం తాలుకాలో జంజావటి స్కీము ఉన్నది. మన ముఖ్య మంత్రిగారు అక్కడికి రాలేదేమోకాని ప్రకాశం మంత్రి వర్గములోని వారందరూ కూడా election రోజులలో అక్కడికివచ్చి అది కట్టిస్తాము, ఇది కట్టిస్తాము, మీరు ఓట్లు ఇవ్వండి అని చెప్పారు. కాని ఇప్పటికీ ఏమి జరగలేదు. దానికి కూడా రెండు లక్షల రూపాయలు దగ్గర అవుతుంది. ఇలాగే వరహాగడ్డ గుమ్మడి గడ్డ ఉన్నది. వీటన్నింటికి కలిసి రెండుకోట్ల రూపాయలు

ఖర్చుపెట్టినట్లయితే ఇప్పుడు కృష్ణా, గోదావరి జిల్లాలలో ఏ విధంగా పంటలు పండుతాయో అలాంటి పంటలే అక్కడ కూడా పండటానికి అవకాశం ఉంటుంది. పర్లాకిమిడి మహారాజుగారు జెక్కలి మహారాజాగారు వారు విలాసంగా తిరగడానికి ఏవో రోడ్లు వేసుకొన్నారు కనీసం లక్ష రూపాయలైన ఖర్చుపెట్టి ఆ రోడ్లనైన బాగుచేసినట్లయితే ప్రజలకు చాల ఉపయోగం కలుగుతుంది. అలాంటి రోడ్లు మరామతు చేయాలంటే కలెక్టరుకు అధికారం లేదంటున్నారు. P A గారు ఆ రోడ్లను చూస్తున్నారే కాదు. అంతేకాక జిల్లా బోర్డుల పరిపాలన చాల అన్యాయంగా ఉందని లాయర్లుకూడా చెప్పుతున్నారు అధ్యక్షులవారు జిల్లా బోర్డు ప్రెసిడెంట్‌గా ఉన్నప్పుడు 40 రోడ్లు వేశారు. 40 high schools పెట్టారు ఇప్పుడు P A గారు ఆ schools వేసుకోవడానికి గట్టిగా ఇవ్వడంలేదు ఆ schools లో పనిచేస్తున్న ఉపాధ్యాయులకు జీతాలు కూడా సరిగా ఇవ్వడంలేదు పైగా పాతిగాం వాళ్లను పార్వతీపురం, పార్వతీపురం వాళ్లను అనకాపల్లి transfer చేస్తున్నారు ప్రతి meeting లో కూడా P A గారిని బదిలీ చేయించి ఇంకొకరిని వేయండి అని ఆ జిల్లాలోని 15 M.L.A లందరు చెప్పినా ఇంతవరకూ వేయలేదు. నిన్న సాయంకాలము కూడా, ముఖ్య మంత్రిగారికి మనవి చేస్తే ఆయన ఆ port folio మంత్రిగారికే మనవి చేయమన్నారు. ఆయనతో మనవిచేస్తే నెల రోజులలో చేస్తామన్నారు. ఈ నెల రోజులలో మనం హైదరాబాదుకు వెళ్లిపోతున్నాము. కనుక ఈ లోట్లన్నింటిని సవరించాలని మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను

గవర్నరుగారి ఉపన్యాసంలో హరిజనుల సమస్య గురించి కూడా ఉన్నది. హరిజనులు ఎంతో కాలము మనుష్యులుగా పరిగణింపబడక గ్రామానికి చాల గజాల దూరంలో ఇండ్లు కట్టుకొని ఉన్నారు. Government budget లో హరిజనులకు. 2 లక్షలు ఇచ్చారు. Cabinet Meeting మరో 4 లక్షలు ఇచ్చినట్లు తెలుస్తున్నది 4 లక్షలు 2 లక్షలు మొత్తం 6 లక్షలలో హరిజనులకు ఏమేమి చెయ్యగలము. నేను M.L.A గా వచ్చి 4 ఏండ్లు అయింది. అంతకు ముందు 20 ఏండ్లనుంచి pending లో ఉన్నది పెదపంచి అనే గ్రామానికి ఒక Director వెళ్లారు. మంత్రులు వెళ్లారు. జిల్లా కలెక్టరుగారి report కూడా వచ్చింది ఇప్పటికి కూడా దానిని enquiry చేసి కావలసినటువంటి స్థలం ఇవ్వలేదని అధ్యక్షులవారికి మనవి చేస్తున్నాను. ఈ 6 లక్షల రూపాయలలో ఈ సంవత్సరము ఏదో ఒక తాలూకాలో హరిజనులకు నివేశన స్థలాలు ఇస్తామంటే మాకేమి అభ్యంతరం లేదు. గాంధిగారు పెట్టిన భిక్షవల్ల

హరిజనుల తరఫున 26 గురము M.L.A. లుగా వచ్చాము. ఈ 26 గురము చెప్పిన మాట లలో కొన్నిటినైన పాలించినట్లయితే మీ తరముగా ఫలానా హరిజనులకు ఇళ్లు కట్టించామని చెప్పుకొంటాము.

హరిజనుల ఇండ్ల స్థలాలనే పేరుతో అక్కడ ఉన్నటువంటి welfare officers, Inspectors, surveyors బ్రతకడమేగాని హరిజనులకు ఒక దమ్మిడీ పనికూడా జరగలేదు దీనిని ముఖ్య మంత్రిగారు గుర్తిస్తారని ఆశిస్తున్నాను. మా జిల్లాకు సంబంధించినంతవరకు చెరువుల మరమ్మత్ కోసమని P W D వారు 1, 2 division లు పెట్టారు దాని కొరకు ఇంజనీరును, ఓవర్‌సీర్‌ను staff ను, అంతా ఇచ్చారు పెక్కలి తాలూకాలో 40 చెరువులు, బొబ్బిలి division లో 20 చెరువులు చూసినట్లు తెలిసినది ఆ estimate లు ఏమైనాయో, డబ్బు ఎమైందోగాని పని మటుకు జరగలేదు పైగా పెక్కలి తాలూకాలోని ఆ engineer ను staff ను తీసేస్తామని అంటున్నారు. అది అట్లా ఉండగా లింగసాగరం అనే చెరువును గురించి report చేశాము అది మంత్రిగారికి అందే ఉంటుంది దానిని వేలము వేస్తె 20 వేల రూపాయలు గవర్నమెంటుకు నష్టము వస్తుంది దానిని ఒక వెయ్యి రూపాయలుపెట్టి కట్టించండి అని Executive Engineer గారికి చెపితే ఆయన ఇంతవరకు చూడనేలేదు దైవ వశంచేత ఆయనకు బదిలీ కూడా అయింది

ఈ 30 వేల రూపాయలు నష్టంలో ఖర్చుపెట్టకుంటే అపుచేశామని అన్నారు అక్కడకు వెళ్ళి చూస్తే పని జరిగిపోతోంది ఈ విధంగా డబ్బు దుర్వినియోగం అవుతోంది. మేము వచ్చింది లగాయతు చూస్తున్నాము 1 రూపాయి శిస్తున్నటువంటి వాటికి 1½ రూ. చొప్పున గోపాలరెడ్డిగారు చేశారు. అయినా వాటన్నింటిని మేము ఒప్పుకొన్నాము Revenue Inspector లు 70 రూపాయలు, తాహశీల్దార్లు 300 రు॥ల చొప్పున జీతాలు ఇస్తున్నారు. వారు చేసేది శిస్తులు వసూలు చెయ్యడం మినహాయిస్తే, చెరువులు మరమ్మత్తు అయినాయంటే ఎవరూ పలకరు. M L A లు represent చేస్తే చూడరు. కాబట్టి ఇలాంటి లోట్లను గోపాలరెడ్డిగారి ప్రభుత్వములో సవరించకుంటే రాబోయే ఎన్నికలలో ఓట్లు రావని, గెలవడం అసాధ్యమని మనవిచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

The Hon. Dr B. GOPALA REDDI ఇంతకూ ఎంత భాగం కావాలనా అక్కడ లేదనా?

Sri P. GUNNAYYA వంశధార కట్టబడలేదనే మేమంతా కట్టు అయినా మన్న సంగతి ప్రభుత్వానికి తెలిసినదే. ఆ ప్రాజెక్టు కడితే మా కట్టు అంతా విడి పోయిందని నమ్మండి

Sri P. ANTHONY REDDI Mr Speaker, Sir, I wholeheartedly support the motion of thanks moved by Sri Vema Reddi on the Governor's Address A review of the Governor's speech will make one believe that the Government is on the high road to establish a Welfare State The various policies the Government have formulated, for the welfare of the State the various schemes that the Government have launched in order to improve the productive capacity of the State and the various reforms that the Government have passed in order to do social justice to the people in the State show that the Government are bent on establishing a socialistic pattern of society

Sir, the Governor in his speech has dwelt at great length on the various steps the Government have taken to improve the educational standards of our State The various methods especially the abolition of elementary grade training and raising the educational qualifications for admission into secondary grade and standardizing the principles of promotion for secondray school training—all these things show that the Government are really keen in improving the educational standards in State But, Sir I feel, I am pained to note, that there is a great omission, for the successful raising of our standard of education. The Governor has failed to mention in his speech about bettering the financial position of the teachers of all categories, elementary, secondary and collegiate Sir, it is the teacher that has to play the most important part in raising the educational standard, it is he who has to train the intellect of our childeren. It is he who has to mould the character of our pupils and ultimately it is he who prepares the future citizens of our Country. So unless this teacher is fully satisfied and is above need, you cannot expect him to do his work efficiently Therefore, Sri, the Government in order to make effective all their measures launched to raise the standard of education should also improve the economic status of the teacher. Sir, I request the Government, represented by our Chief Minister to make an announcement--an announcement not to tell us that he is not going to increase the pay of teachers, but an announcement that he will do something to better the lot of

teachers The Government, in some of the reforms they have effected, as in the retrenchment schemes in the education department reducing the number of stipendiaries in training schools and increasing the average number of pupils per teacher from twenty to twenty five, should have made a saving of twenty to thirty lakhs of rupees For examle the Government spend two and a half crores on elementary education Now, by raising the average number of pupils per teacher from 20 to 25 they must have saved one-fourth to fifth of these two and a half crores, that is, roughly about fifty lakhs Or to put it at a moderate figure, they should have saved thirty lakhs, of rupees. We also know from the newspapers- and I am sure at least this news is true - that the Government of India have come forward to meet a portion of the increased expenditure in the salary of teachers If we consider all these, savings by reducing the number of stipendiaries and the savings by increasing the average number of pupils per teacher from 20 to 25 and the financial help the Government of India have promised, our State Government should be able without any financial burden on their resources, to increase the salary of teachers by about ten rupees, a month per teacher

Here, I want to utter a word of caution I want Government to please note that the effeciency of our teachers is very low Consider for a moment who are the people that take to teaching profession. It is those boys who have made a number of somersaults at the S S L C examination or those who have already finished their Honours Course in the Intermediate examination (Laughter)

The Hon Dr B GOPALA REDDI Finished their Honours Course in their Intermediate examination.

Sri P ANTHONY REDDI Yes Sir, It is such mediocre pupils who take to the teaching profession So, Can you expect these mediocre fellows to raise the educational standards of our country? attractive. financially attractive. A boy who passes the S S L. C examination brilliantly can easily get a Government job on Rs 45 plus Rs 22. But if the very same boy wants to become a teacher He has to undergo at least one year's training, and then he gets only Rs 40 plus Rs 21 in an elementary school, or, if he is lucky enough to get a teacher's post in a high school he gets Rs. 45 plus Rs. 22. For the extra year's training he does not get any benefit Therefore you will all excuse me if I say, an intelligent

pupil or an intelligent young man who takes to the teaching profession under these service conditions ultimately becomes a fool (Loud and continued laughter) So, Sir you see the irony. Therefore, Sir, I request the Government to do something in order to make the teaching profession attractive, do something so that the best talents are attracted to it and raise our educational standard If the Chief Minister in his reply to-morrow just makes an announcement that he is going to increase the pay of teachers, I am sure, that will be the first step at raising the standard of education in the State Thank you, Sir

Sri A YERUKU NAIDU అధ్యక్షా, గవర్నరుగారు చేసిన ప్రసంగంలో చిరకాలంనుంచి ఆందోళన జరుగుతున్నటువంటి Tenancy Protection Bill తప్ప సంతోషించవలసిన విషయాలేవీ లేవని చెప్పుటకు విచారిస్తున్నాను ప్రస్తుతము ప్రభుత్వము ఈ పంచవర్ష ప్రణాళికలక్రిందనూ, ఇతర పధకాలక్రిందనూ కోట్లకొలది రూపాయలు ఖర్చు చూపిస్తూ, అంచనాలు వేస్తూ కాగితాలమీద చూపుచున్నారేగాని, అది ప్రజలకు అందేటప్పటికి అందులో నూటికి 10 వ వంతుకూడా సదుపాయము జరగలేదని చెప్పడానికి అనేక తార్కాణాలున్నాయి. ఈ Five Years Programme క్రింద National Extension Schemes, Community Development Blocks, వీటిని నిర్మించేటప్పుడు, ప్రక్క ప్రక్క ప్రాంతాలలోనే నిర్మిస్తున్నారు గాని, వెనుక బడిన ప్రాంతాలను గాని, అక్కడ ప్రజల అవసరాలను గాని గుర్తించి, వాటిని తీర్చడానికి ప్రభుత్వము పూనుకోలేదు. ఉదాహరణకు ఆముదాలవలసలో ఒక Development Block ఉన్నది. కాబట్టి అక్కడ Primary Health Centre అనేది నిర్మిస్తున్నారు. అక్కడ ఒక Dispensary ఉన్నది. అది ఎక్కడకు మార్చాలనే విషయము మొన్న జిల్లా బోర్డులో చర్చకు వచ్చినప్పుడు, దానిని ఆప్రక్కనే 5 మైళ్లలోఉన్న గ్రామంలో నిర్మించడానికి ఒప్పుకొన్నారు. అక్కడే మరొకచోట ఒకటి నిర్మించడానికి ప్రభుత్వము కూడ ఒప్పుకొన్నారు. అంటే ఒకేప్రదేశములోనే మూడు Dispensaries నిర్మించడానికి జిల్లా బోర్డు, ప్రభుత్వము ఒప్పుకొన్నారు. అంతేకాని దూర ప్రాంతాలలోను, agency, ఇంకా ఇతర వెనుకబడిన ప్రాంతాలలోను నిర్మించడం లేదు. 10, 12 మైళ్ల దూరములో ఏలాటి వైద్య సౌకర్యాలు లేనటువంటి గ్రామాలున్నాయి. అటువంటి ప్రాంతాలకు ఈ Dispensaries మార్చడానికి పూనుకోలేదు కనుక ప్రభుత్వము ముఖ్యంగా అవసరమైనటువంటి, వెనుకబడిన

టువంటి ప్రాంతాలను గుర్తించి, అటువంటి ప్రాంతాలలో సదుపాయాలు కలుగజేయు టకు పూనుకోవలసియుంటుందని మనవి చేస్తున్నాను.

తరువాత Local Bodies విషయంలో, ప్రభుత్వము ఈ మధ్యన ఒక శాసనం చేసి, వాటికి ఇస్తున్న toll compensation ఎగగొట్టి వాటియొక్క ఆర్థిక పరిస్థితులలో అనేక చిక్కులు కలుగజేశారు. సంవత్సరం మధ్యలో budget కూడా sanction అయినతరువాత, వాళ్లకు వచ్చేరాబడి లేకుండాచేసి, వాళ్లకు ఇతర సహాయము కూడ లేకపోయినట్లైతే, వాళ్లకు చాలా ఇబ్బందిగా ఉంటుంది. వాళ్లకు direct taxation తప్పితే ఇతర పన్నులు వసూలు చేయడానికి వీలులేదు కాబట్టి మునిసిపాలిటీలకు ఈ సంవత్సరం కొంత మొత్తమును grant రూపముగానైనా ఇచ్చి వాటియొక్క ఆర్థిక పరిస్థితికి సహాయపడతారని కోరుతున్నాను.

జిల్లాబోర్డు రోడ్డుల పరిస్థితి ఏమీ బాగలేదని చెప్తూ, వాటికి National Highways నుంచో లేకపోతే State Highways నుంచో, నూటికి 10వ వంతు కేటాయించినందుకు సంతోషిస్తూ, ఇది చాలదుగనుక మరికొంత ధనమును కేటాయించి, జిల్లా బోర్డులక్రింద అధ్వాన్న పరిస్థితిలో ఉన్న రోడ్డులను బాగుచేయడానికి పూనుకోవలసిందని కోరుతూ విరమిస్తున్నాను.

Sri K. PUNNAYYA అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగములో ప్రభుత్వము ఇదివరకు నిర్వహించినటువంటి, ఇకముందు నిర్వహించనున్న కార్యక్రమాలనుగురించి సమగ్రంగా తెలియజేయడం సంతోషంగా యున్న విషయము. ఇటీవల మనరాష్ట్రములో అధిక వర్షాలవల్ల చాలా జిల్లాలకు అపారమైన నష్టము కలిగిందనే విషయము తెలిసిన వెంటనే మన ప్రభుత్వాధినేతలు, ముఖ్యముగా మన ముఖ్యమంత్రిగారు, తక్కిన మంత్రులుకూడా ఆప్రాంతాలకు వెళ్లి ఆ రైతులయొక్క కష్ట నష్టాలను స్వయంగా తెలుసుకొని వారి విషయమై అమితమైన శ్రద్ధ తీసుకొన్నందుకు కూడా ప్రభుత్వాన్ని నేను అభినందిస్తున్నాను. మనరాష్ట్రము అనేకమైన అభివృద్ధి కార్యక్రమాలతో పురోగమించడం సంతోషించదగ్గ విషయము. ప్రతి సంవత్సరము, ప్రతి జిల్లాకు ఏదో ఒక పెద్ద ప్రాజెక్టును ప్రసాదిస్తూ ఆ జిల్లా అభివృద్ధికి కృషిచేస్తూ రాష్ట్రాభివృద్ధికి, వ్యవసాయాభి వృద్ధికి అమితమైన శ్రద్ధ తీసుకొంటున్నందుకు కూడ ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. ముఖ్యంగా ప్రతి జిల్లాలో కూడ కొత్త హైస్కూళ్లను, Middle Schools ను స్థాపిస్తూ విద్యాభివృద్ధి గురించి కూడ

ముఖ్యమంత్రిగారు ప్రయత్నం చేస్తున్నందుకు వారికి నా ధన్యవాదాలు. అట్లాగే irrigation projects, development works, electricity సరఫరా మొదలగు అభివృద్ధి కార్యక్రమాల విషయమై ప్రభుత్వము అమితమైన శ్రద్ధ తీసుకొంటున్నది. పోలీసుల వసతి సౌకర్యముగురించి, హరిజనుల నివాసస్థలాల మంజూరు విషయమై గిరిజనుల ఆర్థికాభివృద్ధి విషయమై కూడ ప్రభుత్వము శ్రద్ధ తీసుకొంటున్నది. ఈ వృద్ధి కార్యక్రమమును, మేమంతా శ్రద్ధగా గమనిస్తూ ఉన్నాము. N. G. O. ల విషయములో కూడ కొంతవరకు శ్రద్ధ తీసుకోవలెనని ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను. ముఖ్యంగా తాలూకాఫీసులలోను, జిల్లా ఆఫీసులలోను, పనిచేస్తున్నటువంటి N. G. O లకు నివాస సౌకర్యాలు లేవని ప్రభుత్వము తెలుసుకోవాలి. వారికి కూడ ఒక క్రమపద్ధతిని వసతి సౌకర్యము ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వము పూనుకోవలెనని కోరుతున్నాను

గవర్నరుగారి ప్రసంగం ముఖ్యంగా వ్యవసాయ సంస్కరణల విషయమై ఉత్తేజ పూర్వకంగా ఉంటుందని మేమంతా ఆశించాము. ఈ సమావేశము వ్యవసాయ సంస్కరణలకు సంబంధించిన సమావేశమని రాష్ట్ర ప్రజలందరూ భావించారు. దురదృష్టవశాత్తు వ్యవసాయ సంస్కరణల గురించి ఏమాత్రము కూడ గవర్నరుగారి ప్రసంగములో లేకపోవడం విచారకరమైనటువంటి విషయము. మనము socialist సమాజ నిర్మాణము గురించి చాలాకాలమునుంచి చెబుతూ వస్తున్నాము. ఆవడి కాంగ్రెసులో చేయబడినటువంటి socialist సమాజ నిర్మాణ తీర్మానము గురించి అనేక వేదికలపైన మన ప్రభుత్వ అధినేతలు, కాంగ్రెసు పెద్దలు చెప్పుతూ వస్తున్నారు. కాని ఈ సమయంలో socialist సమాజ నిర్మాణానికి ప్రాతిపదిక అయినటువంటి వ్యవసాయ సంస్కరణల విషయము తెలియజేయకపోవడం శోచనీయమైనటువంటి విషయమని ప్రభుత్వము గుర్తించాలి. వ్యవసాయ సంస్కరణల గురించిన రిపోర్టు మాయెదుట పెట్టబడినది గాని అది వ్యవసాయ సంస్కరణల రిపోర్టు అని చెప్పేందుకు వీలులేదు. కరుడుగట్టిన భూస్వామ్య వ్యవస్థను స్థిరంగా నిలబెట్టేందుకు వ్యవసాయ సంస్కరణలు అనే పేరుతో వ్యవహారం జరుగుతున్నది. వ్యవసాయ సంస్కరణలు రానంతవరకు మనరాష్ట్రములో వ్యవసాయిక రంగములో అభివృద్ధిని సాధించలేము అనేది ప్రభుత్వము గుర్తించాలి. ఇటీవల ఉపముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు రాష్ట్రమంతా వ్యవసాయ సంస్కరణలు గూర్చి ప్రబోధము చేయడము చాలా సంతోషకరమైన విషయము. ఇది ప్రభుత్వ ప్రతిష్ఠను కూడా

అధికతరము చేసినది. మన మంత్రులలో కొంతమందికి ఈ వ్యవసాయ సంస్కరణలకు సంబంధించిన వ్యవహారాలలో ఏమాత్రముకూడ శ్రద్ధలేకపోవడము విచారకరము కమ్యూనిస్టులను ఓడించడం కేవలం భూస్వాములను రక్షించడానికి మాత్రం కాదని ప్రభుత్వం తెలుసుకోవాలి. Democracy పరిరక్షించాలని చెప్పడం భూస్వామ్య వ్యవస్థను పరిరక్షించడం కోసంమాత్రము కాదు Socialist సమాజ నిర్మాణంకోసమే కమ్యూనిస్టులను ఓడించాము Socialist సమాజనిర్మాణం కోసమే democracy ని స్థాపించుకొందామని అనేకసార్లు చెప్పుకొంటూ వస్తున్నాము. కాబట్టి ఈ విషయాన్ని ప్రభుత్వ అధినేతలు గుర్తించాలని మనవిచేస్తున్నాను గ్రామాలలో భూమిపై వొత్తిడి ఎక్కువగా ఉంటున్నది. ప్రతిఒకరు కూడా భూమి కావాలంటున్నారు అయితే భూమికి ceilings పెట్టినంత మాత్రాన, ఎన్నివేలమందికి భూమి ఇవ్వగలమనే argument ఒక ప్రక్కన వస్తున్నది. రెండు ఎకరాల పల్లముగాని 4 ఎకరాల మెరక గాని ఈ విధంగా ఇచ్చినచో కొన్ని వేల కుటుంబాలకైనా భూమి లభిస్తుంది. అనే నమ్మకం నాకున్నది ఆ విధంగా భూమి పంచినట్లయిన రాష్ట్రంలో ఉన్నటువంటి ప్రజలందరుకూడా ముఖ్యంగా పేద వ్యవసాయ కూలీలు ప్రభుత్వం పట్ల అమిత సంతోషాన్ని ప్రకటిస్తారు. వ్యవసాయ కూలీలకు కూలీ హెచ్చించండి అంటే, హెచ్చించుటకు వీలులేదు. ధాన్యపు ధరలు లేవు అని అంటున్నారు. పోనీ బంజరు భూములను వ్యవసాయ కూలీలకు పంచిపెట్టండి అని చెప్పితే, top priority political sufferers అని చెప్పతున్నారు. పోనీ political sufffrers కు ఇచ్చినటువంటి భూమిని విడిచిపెట్టి మిగిలినటువంటి భూములైనా ఇవ్వమంటే కొంత పశుగ్రాసము కొరకు, కొంత burial ground కు ఆ భూములకు పంచవలెనని చెప్పుతూ, వాటినికూడ పంచిపెట్టడానికి పూనుకోడంలేదు అట్లాగే వేలాది, వందలాది ఎకరములు కలిగినటువంటి భూస్వాముల దగ్గరనుంచి, వారికి ceilings పెట్టి, భూమిని సేకరించి ఈ పేదప్రజలకు పంచిపెట్టండని చెప్పితే, అది ఉత్పత్తిని కుంటు పడుస్తుందని చెప్పతూ ఈ విధానంలో కాలయాపన చేస్తున్నారు. ఇదిచాలా శోచనయమైన విషయము. గ్రామాలలో అప్పుడే ఒకవిధమైన సంక్షుభితమైనటువంటి వాతావరణం వ్యాపించి ఉన్నది. ఈవాతావరణాన్ని అదుపులో పెట్టాలంటే, శాంతియుతంగా ఈ సమస్యను పరిష్కరించాలి. కావున వ్యవసాయ సంస్కరణలు తొందరగా తెచ్చి గ్రామాలలో ఉన్నటువంటి అలజడని గాని అసంతృప్తినిగాని తొలగించి, స్థిరమైనటువంటి శాంతియుతమైనటువంటి పద్ధతిలో ఈ వ్యవసాయ విప్లవాన్ని తీసుకురావాలని మాత్రము నేను కోరుతూ విరమిస్తున్నాను.

Sri S K. V. KRISHNAVATARAM మానవీయ అధ్యక్షా, గవర్నరుగారి ప్రసంగము మీద మిత్రులు వేమారెడ్డిగారు తీసుకుని వచ్చిన తీర్మానాన్ని బలపరుస్తూ, గవర్నరుగారి ప్రసంగములో యింకా కొన్ని విషయాలను గురించి సూచనలు ఉన్న ఎడల ప్రజానీకములో మంచి, సంతృప్తి, సంతోషము, ఆశ ఉండేదేనని నేను తెలియజేస్తున్నాను. ఆ విషయములో నేను యింకా కొన్ని సూచనలు చేస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగములో Separation of Judiciary from the Executive గురించి ఎట్టి suggestion లేకుండాపోవడము చాలా విచారకరంగా ఉన్నది. ఈ separation scheme ను రాష్ట్రములో ప్రవేశపెట్టడమనేది నిర్ణయము జరిగిన తరువాత చాలా భాగము వరకు జిల్లాలలో ప్రవేశపెట్టబడింది. అది సంతృప్తికరంగా పనిచేస్తున్నది అనే నమ్మకము కలిగినప్పుడు, యింకను ప్రవేశపెట్టవలసిన మూడు జిల్లాలలో దానిని ప్రవేశపెట్టకపోవడము విచారకరముగా ఉన్నది ప్రభుత్వం ఏ స్కీమునైనా సరే తలపెట్టినట్లైతే, దానిని పూర్తిగా అమలులోకి తీసుకునిరాకుండా మధ్యకాలంలోనే విరమించడం అనేది, అట్టే మంచి సాంప్రదాయము కాదు. మంచి విషయము కాదు కూడా.

ఇటీవల Additional Sessions Judges ను appoint చేయడము జరిగినది. మొట్టమొదట యీ Separation of Judiciary from the Executive Scheme లో వీరికి District Magestrates అని పేరు పెట్టారు. అది మరల మార్చివేసి వాళ్లను Additional District and Sessions Judges అని అన్నారు. వారినే Additional District Magestrates అని అన్నారు. Additional District Magestrates అని చెబుతూ Additional District and Sessions Judges District Magistrates గా వ్యవహరిస్తున్న Collectors కు వారు subordinates అని చెప్పారు. అసలు ఈ స్కీము అంతా చాలా అవకతవకలతో కూడుకొని పనిచేస్తున్నది. ఇటీవలనే మా West Godavari District and Sessions Judge అసలు యీయన Additional District Magistrate కాదు, Additional District and Sessions Judge గా ఆయన పని చేయడమనేది అటు ఉంచి, అసలు వీరిని appoint చేయడానికి ప్రభుత్వానికి అధికారము ఉన్నదా అనే సందేహము కలిగి High Court కు ఒక reference పంపించారు. కాబట్టి యీ విషయము ఒక్క Legal Department కే వదలడం అనేది అసందర్భముగా ఉన్నది.

Law portfolio మంచి అనుభవము ఉన్న Lawyers కే అప్పజెప్పడము చాలా అవసరమని నేను చాలాసార్లు చెప్పాను.

Irrigation and Agriculture విషయములో చాలామటుకు ప్రభుత్వం మంచి అభివృద్ధిని సాధించింది అని చెప్పుకోవచ్చు కాని irrigation పథకాల క్రింద చిన్న నివారణ పథకాల క్రింద ఉపయోగపడే పథకాలను కొన్నింటిని యింకా ప్రభుత్వం take up చేసి, వాటిని పూర్తిచేయకపోవడమనేది శోచనీయముగా ఉన్నది. గవర్నరుగారి speech ముఖ్యంగా యీ మధ్య వచ్చిన వరదలవల్ల కలిగిన damages గురించి మామూలు reference ఉన్నప్పటికినీ, ఎర్రకాలవను గురించి గాని, తమ్మిలేరును గురించిగాని ఎక్కడ చూచిన ఒక్క reference అయినా లేక పోవడము చాలా అసంతృప్తికరంగా ఉన్నది. ఇదిగాక కొల్లేరు ప్రాంతం గురించి దానికిగాను తయారు చేయవలసిన పథకముల నిమిత్తం, వెంటనే Non-Officials, ను Officials ను చేర్చి ఒక కమిటీని ఏర్పాటుచేయడమనేది అవసరమై యున్నది ముఖ్య మంత్రిగారు మా జిల్లాకు వచ్చినప్పుడు యీ కొల్లేరు ముంపు విషయమే కాకుండా, కొల్లేరు ప్రాంతములో ఉన్న లక్షలాది ఎకరాల భూమిని ఏ విధంగానైనా reclaim చేసి పేదవాళ్లకు యివ్వడము అనే సమస్యను గురించి చెప్పాము దీని విషయములో కమిటీ ప్రభుత్వానికి ఒక రిపోర్టుపంపి, దానికి తగిన కార్యక్రమమును నిరూపించి, నిర్వహింపచేయటానికి యీ కమిటీ అవసరమని చెప్పాము ముఖ్య మంత్రిగారు యీ విషయము సావధానముగా విచారిస్తానని చెప్పారు. కాబట్టి యీ తమ్మిలేరు, ఎర్రకాలువ, బుడమేరు, కొల్లేరు ముంపు, తరువాత కోదండ రామయ్య గారి నియోజక వర్గములోని గోవాడ కాలవ, వీటి విషయములో చాలా శ్రద్ధ తీసుకోవలసిందని కోరాము. ముఖ్యంగా యివి చాలా భీభత్సము చేస్తున్నవి. కాబట్టి యీ విషయములో ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

తరువాత పశ్చిమ గోదావరి జిల్లా హెడ్డు క్వార్టర్సు అయిన యేలూరు గవర్నమెంటు హాస్పిటల్ విషయము ఒకటి ఉన్నది దీనిని అభివృద్ధి చేస్తామని గవర్నరు speech లో ఉన్నది అందుకు నా కృతజ్ఞత తెలియజేస్తున్నాను జిల్లా హెడ్డు క్వార్టర్సు హాస్పిటల్సు అన్నింటిలోనూ, అన్ని చోట్లలోనూ మంచి సమర్థతగల staff ను పెట్టి, బాగుగా organise చేసి, అన్ని విధముల సౌకర్యాలతో, యిక యితర జనరల్ హాస్పిటల్సుకు పోనవసరము లేదు అనేటట్లుగా, అన్ని branches

గూడ ఉండేటట్లు, effecient Doctor ను వేసి, ఏర్పాటు చేయమని నా కోరిక. ఇంకను Dentists దొరకకపోతే, local గా available ఉండేవారు దొరికితే వారికి honorarium అయినా తగినంత యిచ్చి, ప్రోత్సాహించవలసిందిగా కోరుతున్నాను. ఇదిగాక ప్రత్యేకంగా ఆయుర్వేదము, హోమియోపతి, యూనాని మొదలైన Indegenous system of medicines ను ప్రవేశపెట్టి encourage చేయవలెనని నా అభిలాష. ఇవి అన్నీ encourage చేయడము చాలా మంచి విషయము. ఈ విషయములో ఒక బిల్లును ఈ సమావేశంలోనే ప్రభుత్వం ప్రవేశపెట్టబోతున్నదని విన్నందులకు నాకు చాలా సంతోషముగా ఉన్నది.

మా పశ్చిమ గోదావరి జిల్లాలో నారికురుపులబాధ లోగడ యీ ఎసెంబ్లీ సమావేశములో చెప్పాను, మా జిల్లాలో విపరీతముగా , ముఖ్యంగా నా నియోజక వర్గములో మెండుగా ఉన్నది గ్రామ సీమలలో ఉన్న బావులలోని నీరు మురికిగా ఉండడంవల్ల యీ నారికురుపులవల్ల విశేషముగా జనము బాధపడుచున్నారు. దీనికి నివారణోపాయమును గురించి చెప్పియున్నాను. ఈనాడు ప్రభుత్వం తలపెట్టిన National Rural Water Supply and Sanitary Scheme మా జిల్లాలో ముఖ్యంగా తాడేపల్లిగూడెం తాలూకాలోనూ, ఏలూరు తాలూకాలోనూ త్వరితముగా ప్రవేశపెట్టవలసిందిగా అర్థిస్తున్నాను. ముఖ్యంగా Eluru పట్టణమునకు Drainage scheme కు technical and financial sanction యిచ్చినందులకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను.

Electricity విషయములో మా జిల్లాలో upland అనగా మెట్ట గ్రామాలకు Electricity రాలేదు. అక్కడికిగూడ పొడిగించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. నా నియోజకవర్గము చెందిన తాడేపల్లిగూడెం ఫిర్కాలోతాడేపల్లిగూడెం గ్రామములో మాత్రమే Electricity ఉన్నది. అన్ని గ్రామాలకు Electricity ను extend చేయవలసిందిగా కోరుతున్నాను. చింతలపూడి తాలూకాలో ఒక్క గ్రామానికిగూడ Electricity లేదు. ధర్మాజీగూడెం ఫిర్కాలో కొన్ని గ్రామాలకే Electricity వస్తుందని అంటున్నారు. ఇది అన్ని చోట్లకు వచ్చేటట్లుగా చేయాలని అంటున్నాను.

Land Reforms ను గురించి మిత్రులు చాలామంది పలువిధములుగా చెబుతున్నప్పటికీ వీటికి సంబంధించిన రిపోర్టులోని passing references మాత్రము చదివాను. Land Reforms Committee వారు చేసిన సూచనలను అన్నీగూడ అంగీ

కరించినా, అంగీకరించకపోయినా, మొత్తముమీద వారు రాష్ట్రమంతా తిరిగి సేకరించిన information, వారు చాలా కష్టపడి ముఖ్యమైన సమాచారమును సేకరించారు అందుకు వారిని అభినందించవలసినదే, ఈ రిపోర్టులోని విషయాలు సూచనలు సభ్యులముందు పెట్టకుండా, అందరి ఆమోదము పొందకుండా ప్రభుత్వము ఏ శాసనము చేయజాలదని మనకందరికీ తెలుసును.

Prohibition గురించి, ఒక విషయము మాత్రము చెప్పదలచాను. Prohibition సమస్యమీదనే గత ప్రభుత్వం పడిపోయిందనే మనకందరికి తెలిసిన విషయమే. Prohibition Department Police వారికి hand over చేసినంత మాత్రాన Prohibition successful అయిందనిగాని, పెద్ద ఘనకార్యము చేశామని గాని ప్రభుత్వం అనుకోటానికి వీలులేదు. పోలీసువారికి hand over చేసిన తరువాత ప్రభుత్వం ఎప్పుడైనా Prohibition ఏ విధముగా work చేస్తున్నది అనేది ఆలోచించిందా అని సందేహము వస్తున్నది. Prohibition విషయములో సరియైన మార్గములో organise చేస్తే, తప్పకుండా పూర్తి success ప్రభుత్వం పొందగలదని నా నమ్మకము మా జిల్లా ప్లానింగు కమిటీలో శాసనసభ్యులము మెంబర్లుగా ఉన్నాము. అందులో యీ prohibition గురించి గట్టి ఏర్పాట్లు చేయటాన్ని గురించి మాట్లాడుకుని ఉన్నాము. అప్పటినుంచి మా జిల్లాలో కొత్తమార్పు వచ్చి సరీగా పని జరుగుచున్నది. ఏమైనప్పటికినీ, యీ విషయములో ప్రభుత్వము కొంత శ్రద్ధవహించి కట్టుదిట్టముగా అమలు జరిగేటట్లు చేయాలని అంటున్నాను.

హరిజనులకుయిళ్ల స్థలాలు యిచ్చే విషయములో చాలా ఆలస్యము జరుగుచున్నది. ఇప్పటికే చాలా ఆలస్యమయింది. ఇకమీదటనైనా తొందరగా వాళ్లకు యిళ్లకు స్థలమును సేకరించి యివ్వవలసిందిగా కోరుతున్నాను.

తరువాత Employment Exchange Officersను Staffను మన administration క్రిందకు తీసుకోవడము మంచి విషయమేనని అంటున్నాను. ఈ ఆఫీసుల నిర్వహణ కట్టుదిట్టముగాను, సమర్ధనీయముగాను జరిపించేటట్లైతే, నిరుద్యోగ సమస్య పరిష్కరించటానికి వీలుఅవుతుంది.

Prices of food stuffs ను గురించి ముఖ్య మంత్రి గోపాలరెడ్డిగారు కేంద్ర ప్రభుత్వానికి వ్రాశామని. జవాబుకొరకు ఎదురుచూస్తున్నామని అన్నారు. ఈ

విషయము క్రిందటిసారి సమావేశములో గూడ వచ్చింది. ఒకసారి ధాన్యపు ధరలు తగ్గిపోయినప్పుడు రైతులకు ఆందోళన హెచ్చిందని చెప్పడం జరిగింది, కాని ఇది కేవలం చాలామంది పేదప్రజానీకానికి చెందిన సమస్య గనుక వాళ్లలో ఆందోళన పెరగకుండా వెనువెంటనే చౌక డిపోలు ఏర్పాటు చేయవలసిందిగా కోరుతున్నాను.

ఇకపోతే జిల్లా బోర్డులను గురించి చెప్పడము అవసరమనుకుంటాను, పశ్చిమ గోదావరి జిల్లాబోర్డు administration చాలా అధ్వాన్నస్థితిలో ఉన్నది. ప్రస్తుత పరిపాలన ఏవిధముగా ఉన్నదంటే, అసలు జిల్లాబోర్డుల పరిపాలన జరుగుతున్నదా లేదా అనిపిస్తుంది, కలెక్టర్లను blame చేసి లాభములేదు. ఈ విషయాలన్నీ ప్రభుత్వం గుర్తించి తగు శ్రద్ధ తీసుకొని చర్యతీసుకోవలసిందిగా కోరుతూ సెలవు తీసుకుంటున్నాను

Sri G. NAGESWARA RAO అధ్యక్షా, గవర్నరుగారి ఉపన్యాసములో ప్రధాన సమస్యలు పరిష్కారము అవుతాయని ఆశించాము అయితే దానిలో ఏవో ప్రభుత్వ కార్యకలాపాలు తప్ప, ప్రజలకు సంబంధించినవి అందులో ఉదహరించబడలేదు. ముఖ్యంగా లంకభూముల విషయములో గత సమావేశములో ఏప్రియల్ అయిదవ తేదీన ముఖ్యమంత్రిగారితో అన్నిపార్టీలకు సంబంధించిన 30 మంది శాసన సభ్యుల సంతకాలతో ఒక మెమోరాండమును సమర్పించియున్నాము. అందులో మూడవవంతు లంకభూములు పశువుల మేతకొరకు వేలము వేయాలని ప్రభుత్వము జారీచేసిన ఆర్డరు చాలా అన్యాయముగా ఉన్నది. ఇది ముఖ్యంగా హరిజన సొసైటీలకు, పేద ప్రజలకు చాలా నష్టము కలుగజేస్తున్నదని చాలా వివరాలతో ప్రభుత్వానికి ఆ మెమోరాండము ద్వారా తెలియజేసి యున్నాము. మెమోరాండములో కోరబడినవాటికి విరుద్ధముగా, ఆ ఆర్డరును ఏమీ మార్చునవసరం లేదని ప్రభుత్వము సమాధానము పంపించింది. సంవత్సరము పొడుగునా లంకభూముల్లో పశువులు మేయడానికి గడ్డి కొరత ఏమాత్రం వుండదు.

సెప్టెంబరు నెలలో లంకలలో పైరులు వేస్తారు. ఈ పైరులు డిశెంబరు జనవరి వరకు వుంటాయి. ఈపంట వున్నకాలములో పశువులమేత లంకలో అపారంగా వుంటుంది. పంటలేని కాలములో కూడా పశువులకు లంకల్లో మేత వుంటుంది.

ఈ అవకాశమే రాకుండా పశువుల మేతకు ప్రత్యేకంగా పుల్లరి ( గడ్డి ) లంకలు వేరే వున్నాయి ఇలాంటప్పుడు వేరే పశువుల మేతకంటూ పంటలు పండే లంకల్లో 3 వ వంతు మినహాయించడము అన్యాయం. ఈ 3 వ వంతు లంకలలో పంటపండించుకోడానికే పెద్దరైతులు వేలకొలది రూపాయలు వెచ్చించి పాడుకుంటున్నారు. ఈ విషయం ప్రభుత్వ దృష్టికి తెచ్చాము. కాని యింతవరకు చర్య తీసుకోలేదు. ఈ 3 వ వంతు దూళ్ళమేత పేరుతో పెద్దరైతులకు, భూస్వాములకు లంకభూములను కట్టిపెట్టడము తప్ప ఇంకేమికాదు. ఉదాహరణకు రాజోలు తాలూకా మానేపల్లిలో హరిజన ఫీల్డు లేబరు సొసైటీ ఉన్నది ఆ గ్రామములో 3 వ వంతు లంకభూమిని వేలము వెయ్యడమువల్ల ఆ సొసైటీ 20—30 సం॥ నుండి చేస్తూవున్న 3 లంకలు వేలానికి పెట్టబడ్డాయి. ఒక్క లంకకూడా యీ సం॥ ము ఆ సొసైటీకి లేకుండా పోయింది. అలాగే శివకోడు హరిజన సొసైటీ గత సంవత్సరము 146 ఎకరాలు లంకభూమి సాగుచేస్తే, ఈ సంవత్సరం 3 వ వంతు పేరుతో 88 ఎకరాలు పాటకు పెట్టారు. ఈ ఫీల్డు లేబరు సొసైటీవారు 15—20 సంవత్సరములనుండి యీ లంకలను సాగుచేస్తున్నారు. ఈ లంకలను తీసివేసి వేలము పెట్టడం అంటే ఆభూములను భూస్వాములకు కట్టబెడుతూ వుంది ప్రభుత్వం వారు యీ లంకల్లో విలువైన పంటలు పండించుకుని యింకా భాగ్యవంతులు కావడానికి పేదవాళ్లు యింకా తిండిలేకుండా పోవడానికి ప్రభుత్వ విధానం దారి తీస్తూంది అందుచేత యీ 3 వ వంతు మినహాయింపును రద్దుచేసి యీ లంకభూములను కూడా F L C సొసైటీలకే యిచ్చేటట్లు ప్రభుత్వము వెంటనే శ్రద్ధ తీసుకోవాలని కోరుచున్నాను.

ఇక మూడు సంవత్సరముల యావరేజి రెంటల్ అనే G.O ను తీసుకుందాం. ఇది నిజంగా చాలా విపరీతముగా ఉన్నది దానివల్లనే F. L C. సొసైటీలు బకాయిలు పడిపోతూ వున్నాయి. బకాయిలు వున్నాయి, కాబట్టి మీ సొసైటీకి లంకలు యివ్వము అనిచెప్పి, ఆ లంకలను వేలానికి పెడుతూవుంది ప్రభుత్వము. ఈ రేటుకు సొసైటీలు అంగీకరించడము లేదు ప్రభుత్వము యీ విధానాన్ని మార్చుకోవడమూ లేదు ఈ రేటువల్ల సొసైటీలన్నీ దెబ్బతింటున్నాయని, రైత్వారీ రేట్లకే లంకభూములను సొసైటీలకు యివ్వాలని శాసన సభలలోను బయటకూడా ఎంతో ఆందోళన జరుగుతూవున్న ప్రభుత్వము యింకా మార్చుకోలేదు రైత్వారి రేటుకు యిస్తే ప్రభుత్వానికి తక్కువ ఆదాయము వస్తుంది కాబట్టి ఆరేటుకు యివ్వము

అని చెబుతూవుంది పోనీ ప్రస్తుతానికైనా నామమాత్రపు రేటుకట్టి సొసైటీలకే యివ్వాలని కోరుమన్నాను. కాబట్టి ఆపద్ధతి రద్దుచేసి నామ మాత్రపు రేటు పెట్టి లంకలను F. L. Society లకు ఇవ్వవలెను. ఆలాచేస్తే పశువులమేతకు లోటు ఉండదు.

Caste Hindu Poor Workers Co-operative Society అని.F.L C సొసైటీ అని పేర్లుపెట్టి అంతకుముందున్న F L C సొసైటీలకు పోటీగా గవర్నమెంటు ఉద్యోగస్థులు register చేయిస్తున్నారు. వారికి అంతకుముందు చాలాకాలమునుండి హరిజన F L C సొసైటీ సాగుచేసుకొంటూన్న లంకభూములను లాక్కొని యీ సొసైటీలకు యిస్తున్నారు. ఉ॥రాజోలు తాలూకా మానేపల్లి హరిజన F.L.C సొసైటీ, 37 సం॥ నుండి సాగుచేసుకుంటూన్న సుమారు 60 ఎకరముల లంకభూమిని లాక్కొని అదేగ్రామములో నాగుల్లంక Poor Workers Co-operative Society కి యిచ్చారు హరిజన సొసైటీ 2,200 రూ॥లు బకాయి పడ్డమువల్ల యీ లంకను ప్రభుత్వము వేలానికి పెట్టింది.

5-10-55 న వేసే వేలమును ఆపుజేస్తే బకాయి చెల్లించివేస్తామని హరిజన సొసైటీ రాజోలు తహసిల్‌దారును కోరితే, వారు అంగీకరించి 18-10-55 వ తేది లోపల బకాయి చెల్లించమన్నారు హరిజనులు 3 దఫాలుగా 18 వ తేదికి 2,200 రూ॥లు వాళ్ళ యిండ్లలో వున్న పుస్తె పూస తాగట్టుపెట్టి చెల్లించివేశారు. చెల్లించిన రోజునే తూర్పు గోదావరి జిల్లా కలెక్టరు గారికి టెలిగ్రాము ద్వారాను తరువాత ఒక పిటీషను ద్వారాను తెలియచేశారు అయినప్పటికి కలెక్టరుగారు ఆలంకను 21-10-55 న Poor Workers Society కే ఇచ్చినారు 2.10-55 న 17 మంది మెంబర్లతో ఆ సొసైటీ రిజిష్టరైంది ఆ మరునాడు అర్ధరాత్రి నర్సాపురంనుండి ఒక కో అపరేటివ్ యిన్స్పెక్టరును తెచ్చి start చేశారు ఈ 17 మందిలో 10 మంది పెద్ద పొగాకు వర్తకులు, భూములున్నవారు వున్నారు. పేదవారిని హరిజన సొసైటీ లోగాని శెట్టిబలిజ సొసైటీలోగాని చేర్చి ఉండవలసింది; అట్లా చేయకపోవడమువల్ల గ్రామములో కలహాలకు దారితీసింది. యీవిధమైన ఫలితాలు మరొక సొసైటీని రిజిష్టరు చేయడమువల్ల ఏర్పడుతున్నాయని గతములో నేను చెప్పినప్పటికి ప్రభుత్వము చర్యతీసుకోలేదు, గ్రామంలో ఒకే ఒక సొసైటీ వుండేటట్లు చూడాలి. Food

Co-operative Society లకు లంకలను మూడు సంవత్సరాలు ఏవరేజి రెంటల్‌కు యిచ్చే పద్ధతిని రద్దుచేసి నామమాత్రపు లీజురేటుకు యివ్వాలని కోరుచున్నాను.

బంజరు భూముల విషయమై గత సమావేశములో సంజీవరెడ్డిగారు 'సాగుచేస్తున్నట్లు రుజువు చెయ్యండి. రాజకీయ బాధితులకు ఇవ్వము' అని ఖచ్చితంగా చెప్పారు. రాజోలు తాలూకా అంతర్వేదికస్పా ఆది ఆంధ్ర F L సొసైటీ 226 యా॥ లను చాలకాలంగా చేస్తూవుంటే దాన్ని గుర్తించలేదు. 189 ఎకరాలకు 1942 నుండి పన్ను కడుతున్నారు. గ్రామములో 12 గ్రూపులనుండి సాగుదార్లు 12 మంది పెద్దల ద్వారా యీపన్నులు కడుతూవున్నారు. యిప్పుడు ప్రభుత్వము ఆ 12 మందే పన్నులు కట్టి సాగుచేశారు కాబట్టి వీరికి 2½ యా॥ల చొ॥ యిస్తామని, 30 యా॥లు. వారికి కేటాయించామని, 159 యా॥లు. రాజకీయ బాధితులకు యివ్వామని చెప్తూవుంది. 12 గ్రూపులలో వున్న సాగుదార్లు మా 12 మందిద్వారా యీ 189 యా॥లకు పన్నులు చెల్లించారని యీ 12 మంది పెద్దలు రాజోలు తాలూకా బంజరు తాహసీల్దారు వద్ద స్టేటుమెంట్లు యిచ్చారు. మిగిలిన సాగుదార్లకు భూమి యివ్వకుండా మా 12 మందికి మాత్రమే యిస్తే మాకు అక్కర్లేదని కూడ మరొకసారి బంజరు తాహసీల్దారువద్ద చెప్పారు. యీ రిపోర్టులన్నీ దృష్టిలో పెట్టుకోకుండా, ఆ 159 యా॥లను రాజకీయ బాధితులకు కట్టబెట్టాలని చూస్తూవుంది. ఇది అన్యాయము. పన్నులు చెల్లించిన సాగుదార్లందరకు మాత్రమే ఆ బంజరును పంపకము చేయాలి.

నర్సాపురము తాలూకా మొగలితుర్రు సత్తరువుపాలెము గీతపనివారు లింగన బోయిన చెర్లలో 50 యా॥ల forest బంజరును 1947 నుండి పన్నులు చెల్లిస్తూ, సాగు చేస్తూఉంటే దానిని రాజకీయ బాధితులకు యివ్వడానికి ప్రభుత్వము ప్రయత్నిస్తూ వుంది. అమలాపురము తాలూకా నిమ్మకాయల కొత్తపల్లిలో ఆది ఆంధ్ర F. L C. సొసైటీ 1942 నుండి సాగుచేస్తూవున్న 75 యా॥లను రాజకీయ బాధితులకు యిచ్చినట్లు తెలుస్తూ వుంది. యీ బంజర్లను పేదలు సాగుచేస్తూ వున్నట్లు ఋజువుచేస్తూ వున్నప్పటికి ప్రభుత్వము ఆ బంజర్లను రాజకీయ బాధితులకు యిస్తూవుంది. ప్రభుత్వమువారు వెంటనే బంజర్ల విషయములో తమ విధానాన్ని మార్చుకొని పన్నులు చెల్లిస్తూ భూమిని అభివృద్ధిచేసి సాగుచేసుకుంటూన్న పేదలకు మాత్రమే పట్టాలు యివ్వాలని కోరుచున్నాను.

Sri T. RAMACHANDRA REDDI అధ్యక్ష మహాశయా, గవర్నర్ గారు 8వ తేదీన యిచ్చిన ప్రసంగాన్ని నేను ప్రశంసిస్తూ మీద్వారా గవర్నమెంటు దృష్టికి కొన్ని సూచనలు తేదలచుకున్నాను. ఏదో దురదృష్టవశాత్తు మన ఆంధ్రదేశంలో ఒక ప్రాంతంలో అనావృష్టి మరొక ప్రాంతంలో అతివృష్టివల్ల ప్రజలు బాధపడుతు న్నారు. యీ వరద బాధలవల్ల లేనిపోని యిబ్బందులు కల్గే పరిస్థితులు ఏర్పడినవి. యీ వరదబాధ ప్రతి సంవత్సరము రానేవస్తుంది. కాని మనకు యీ వరదలనుంచి ఏలాంటి యిబ్బంది కల్గకుండా శాశ్వత నివారణోపాయము ఏదైనా చేస్తే మంచిదని నా అభిప్రాయము. ఇంతవరకూ కాలయాపన చేశాము ప్రతి సంవత్సరం మనము లక్షలాది రూపాయలు యీ వరదబాధితులకు గాను ఖర్చుపెట్టుతూనే వున్నాము. కాని యీ రీతిగా ఎన్ని సంవత్సరాలుగా మనము ఖర్చుపెట్టాలో తెలియకుండా వుంది. ఒక్కదఫా మనము కొన్ని కోట్లయినా ఖర్చుపెట్టి శాశ్వతంగా నివారణ చేయాలని నేను మీద్వారా వారికి విన్నవించుకుంటున్నాను. ఇంకా మరొక ముఖ్య విషయం. ఆకలి దప్పులకు అలమటించే రాయలసీమ ప్రాంతమునకు, శ్రీకాకుళం జిల్లాకు తుంగభద్ర ఎగువ కాల్వ, వంశధార ప్రాజెక్టు ప్రభుత్వం ప్రసాదించడం చాల ప్రశంసనీయమైన విషయమే, దానికి నేను సంతోషిస్తున్నాను చాలా గర్విస్తున్నానుకూడా. కాని మరొకవైపు ఎలాటి సదుపాయాలు సౌకర్యాలు లేకుండా వుండే ప్రాంతాలుకూడా వున్నాయని చెప్పి నేను మీ దృష్టికి మరల తీసుకొస్తున్నాను. అటువంటి ప్రాంతాలకు Electricity తప్ప మరి వేరే అవకాశమేలేదు. అటువంటి ప్రాంతాలలోకూడా ఏదో ఒక సాకు చెప్పి అది remunerative కాదనే నెపంతో ఆ Electricity schemes ను వెనుకకు నెట్టి వేస్తున్నారు, కాని నేను ప్రభుత్వాన్ని అడుగదలచుకొన్నాను. ఇచట, ఇపుడు వారు అనేక schemes ను ఆచరణలో పెట్టుతున్నారుకదా, అందులోఏవి remunerative అని అడుగుతున్నాను Which is remunerative, I want to ask the Government please మరొక విషయం ఏమిటంటే, Engineers అనుకుంటే మాత్రము నిమిషములో remunerative పోతున్నాయి వాండ్లకు అక్కరలేకుంటే మాత్రం అవి non-remunerative పోతున్నాయి ఉదాహరణకు కొన్ని నిదర్శనలు కూడా చూపగలను కాని వాటి వివరాలలోనికి నేను పోదలచుకోలేదు. ఇటువంటి దృక్పధంతో ప్రభుత్వం వ్యవహరిస్తుంటే మాత్రము ప్రజానీకంలో మనము చాల పలుచన ఐపోతామని మరల మరల మీకు చెప్పుతున్నాను. అందులో మరొక ముఖ్య విషయం ఏమిటంటే మొట్టమొదటినుంచి ప్రజలకు అనేక ఆశలు చూపించాము. ఒక

దఫా మేము మీకు 10 రూపాయలలోపు శిస్తును మినహాయింప చేస్తామని చెప్పినాము. మరల surcharge కూడా లేదని చెప్పినాము పోయిన దఫా ముఖ్య మంత్రిగారు surcharge ఒక్క సంవత్సరానికి మాత్రమే, ఒక్క ఫస్లీకి మాత్రమే అని మొదట చెప్పి యీనాడు మరల దానిని మరొక సంవత్సరానికి పొడిగించడం చాల శోచనీయంగా వుంటుందని నేను ప్రభుత్వ దృష్టికి తీసుకరాదలస్తున్నాను మరి ఇదే అసెంబ్లీలో 'Third Form వరకు ఉచిత విద్య' అని చెప్పారు కాని ఆమాటను నిల్పుకోలేక పోతున్నారని యీనాడు ప్రతి గ్రామములోను అంటున్నారు ఏమండీ మీరు 3rd Form వరకూ ఉచిత విద్య యిస్తామని మీ ముఖ్య మంత్రిగారు చెప్పారు మరల మీరు ఒక్క first form వరకు మాత్రమేనని అంటున్నారని అడుగుతున్నారు. మనము ఏది చేయదలచుకున్నా మొట్టమొదటనే నిర్దిష్టంగా బాగా ఆలోచన చేసుకొని statements యివ్వాలి కాని మనము ఏదో ఒక statement యిచ్చి దానిని అనుసరించకుండాపోతే మాత్రం మనపై ప్రజలలో ఎంత మాత్రము గౌరవము వుంటుంది అనేది బాగా ఆలోచన చేసుకోవాలి. రైతులకు మనము చేస్తూ వుండేది చాల అన్యాయం. మరొక విషయం ఏమిటంటే, గత సంవత్సరం ధరలు లేక అల్లాడేటటువంటి రైతాంగాన్ని చూచి వారికి సరియైన ధరలు ఏర్పాటుచేయాలని చెప్పి ఇదే Assembly లో నేను, నాతోటి మిత్రులుకూడా చెప్పాము కాని ఆనాడు దానిని అంతా మనసు పెడచెవిని పెట్టాము ఈదినం వారి మీద పన్నులు వేసేందుకు వెనుదీయడం లేదు. ఒకవైపున వారికి సత్కారాన్ని యివ్వకుండా వారిమీద పన్నువేయడం చాల అన్యాయమని నేను అంటున్నాను. ఇక యీ జిల్లా బోర్డులు వున్నవి జిల్లా బోర్డులను Special Officers స్వాధీనముచేసి దాదాపు 3½ సంవత్సరాలు కావస్తుంది. కాని ఎప్పటికి యీ జిల్లా బోర్డులకు మోక్షము వుందో నాకు అర్థము కావడంలేదు. ఆఖరుకు శాశ్వతంగా యీ Special Officers స్వాధీనం చేస్తారా? అని నేను కొంతవరకూ అనుమానిస్తున్నాను. అందులో ముఖ్యంగా యీ Special Officers వారియొక్క revenue కార్యక్రమాలు యీనాడు సక్రమంగా నెరవేర్చుకోలేకుండా ప్రతి కలెక్టర్ Table మీద files pending లో వుంటున్నాయి అటువంటి పరిస్థితులలో యీ భారాన్ని వారిమీద మోపడం చాల అన్యాయమని చెప్పి నేను పదే పదే మీకు విన్నవిస్తున్నాను. అందులో ముఖ్యంగా వారికి హెచ్చు పనులు వుండడమువల్ల యీ జిల్లా బోర్డు వ్యవహారాలు చాల వెనుకబడుతున్నాయి. ముఖ్యంగా నేను ప్రభుత్వ దృష్టికి ఒక విషయం తీసుకొస్తున్నాను.

ఇటీవల నేను నా నియోజకవర్గములో కొన్ని గ్రామాలలో తిరిగాను. కొన్ని గ్రామాలకు టీచర్లు బొత్తిగా రారు లేకపోయినా కూడా ఎక్కడ వుండేవారు జీతాలు తీసుకుంటు న్నారు. యీ విషయమై మేము D E O కు వ్రాసినా కూడా వారు ఎందువల్లనో ఆ విషయంలో ఏ చర్య తీసుకోలేకుండా పోతున్నారు. ఇటువంటివి జరుగుతున్నప్పుడు యీ జిల్లా బోర్డులను యీ Special officers స్వాధీనంలో ఎందుకని వుంచారో నాకు అర్థంకావడము కాకుండా వుంది. సత్వరమే మీరు ఎన్నికలను జరిపి ప్రజా ప్రతి నిధులను అందులోపెట్టి ఏదైనా ఒకటి చేయాలని నేను మిమ్మలను కోరుతు న్నాను. ఈ అవకాశమిచ్చినందులకు అధ్యక్షుల వారికి నా హృదయ పూర్వక అభి వందనాలు.

Sri S. NARAYANAPPA అధ్యక్షా, శ్రీ గవర్నర్‌గారి ప్రసంగాన్ని పురస్కరించుకొని మన శాసన సభ్యులు శ్రీయుత వేమారెడ్డిగారి అభినందనతీర్మా నాన్ని నేను బలపరుస్తూ కొన్ని సూచనలు మాత్రం చేయదలచినాను. ప్రస్తుతం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణం తర్వాత విశాలాంధ్ర నిర్మాణం జరుగబోయేటటువంటి సంద ర్భములో యావత్ భారతదేశానికి ఆంధ్ర ప్రజానీకం చూపినటువంటి ఆదర్శం యీ నాడు భారత దేశంలో అమలు జరుగుతుంది. అది రాష్ట్ర పునర్విభజన సమస్య. ఇప్పుడు పార్లమెంటులో ఆ బిల్లు సమగ్రంగా pass అయి అమలులోనికి నవంబర్ 1-వ తేదీన వస్తుంది. యీ సందర్భములో మనము మన సోదరులైన తెలంగాణా ప్రజలతో కలిసి వుండబోతున్నాము తర్వాత మిగతా రాష్ట్రాలలో వున్నటువంటి మన తెలుగు సోదరులను వదలిపెట్టి వారిని దుఃఖ సముద్రంలో ముంచి హర్షములో మనము మాత్రం ముక్కోటి ఆంధ్రులతో రాష్ట్రాన్ని ఏర్పాటు చేసుకొను శుభముహూర్తము మనకు కల్గుతుంది యీ విషయాన్ని ప్రారంభంలో గవర్నర్‌గారు ప్రసంగిస్తూ తర్వాత మన రాష్ట్ర అభివృద్ధి, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణమైన తర్వాత ఆంధ్ర ప్రభుత్వం, ఆంధ్ర శాసన సభ్యులు చేసినటువంటి కృషి ఫలితంగా ఆంధ్ర రాష్ట్రం మరుకుతనంగా ముందుకు వెళుతూ ఎన్నో కార్యాలు వ్యవసాయకంగా గాని, విద్యాభివృద్ధి విషయంలో గాని, పరిశ్రమల స్థాపన విషయంలోగాని ప్రభుత్వము చూపుచున్న ఆదరణ, చేయుచున్న కృషి వీటినన్నిటిని గురించి గవర్నర్‌గారు తమ ప్రసంగంలో సూచించారు. ఐతే చిరకాలంగా ఆంధ్రదేశంలో వెనుకబడినటువంటి ప్రాంతాలకు అనగా విశాఖపట్టణం శ్రీకాకుళం జిల్లాలకు అత్యవసరమైనటువంటి వంశధార ప్రాజెక్టును సాధించాము. ఉప ముఖ్యమంత్రి అయిన శ్రీ సంజీవరెడ్డిగారి కృషి ఫలితంగా తుంగభద్ర ఎగువ

ఫలాన్ని సాధించగల్గాము ముఖ్య మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు, ఉప ముఖ్య మంత్రి శ్రీ సంజీవరెడ్డిగారు ఉభయులు Planning Commission వారి దగ్గరకు వెళ్లి వారిని ఒప్పించి కావలసిన ఆర్థిక సహాయాన్ని పొందే సావకాశం మన ప్రభుత్వానికి ఏర్పడి నందువల్ల నాగార్జునసాగర్ ప్రాజెక్టుకు శంకుస్థాపన జరుపుకొని సస్యశ్యామలమౌతున్న ఆంధ్ర దేశము యావత్ భారత దేశానికే కాకుండా అవసరము వస్తే వెలుపలి ప్రపంచానికి కూడా మనము ధాన్యాలను పండించేటటువంటి ప్రాజెక్టుల నిర్మాణము చేసుకొనే కార్యకలాపం యీనాడు ఆంధ్రదేశంలో జరుగుతూవుంటే మన రాష్ట్రం వ్యవసాయరంగా ఎంతముందుకు పురోగమిస్తోందో తెలుస్తుంది

4-30 P M.

ఈ సందర్భంలో భూమి సంస్కరణలు కావాలి వ్యవసాయ కూలీలు బాగోగులు, జరగాలి అన్న సమస్యలు లేకపోలేదు. భూదాహం పెరిగిపోతుంది. దేశంలో, రాష్ట్రంలో అన్ని వర్గాలు అన్ని మూలలనుంచి, భూసమస్య పరిష్కారం కావలెనని అంటున్నారు. అయితే ప్రభుత్వం వేసిన కమిటీ, ఆ కమిటీ చేసిన సూచనలు వెంటనే పరిశీలనచేసి, ప్రభుత్వం ద్వారా పరిష్కరించేటటువంటి ప్రయత్నంచేస్తే ఆంధ్రదేశం యావత్తు సంతోషిస్తుంది. బీదప్రజలుకూడ అంతో ఇంతో మాకు కూడ ప్రభుత్వాలు అండగా ఉండి కృషి చేస్తున్నాయని మా మంచి చెడ్డలకు ఆధారంగా ఉండి వీలైనంతవరకు సహాయం చేస్తున్నారన్న విశ్వాసాన్ని సంపాదించే ప్రయత్నం జరుగుతుంది భూసంస్కరణలు, అందుకు సంబంధించిన ఇతర సంస్కరణలు కూడ ప్రభుత్వం తీసుకొని వచ్చే ప్రయత్నం తప్పు కాదు పెద్ద పెద్ద ధనికులున్నారు, ఎన్నో ఇండ్లు మేడలుండి బంగారు కిలిగి వివిధ రకములైన ధనములతో వున్నవారు దేశంలో లేకపోలేదు. వారి సమస్యలు కూడ పరిష్కరించే ప్రయత్నం ప్రభుత్వం జరుపవలయునని కోరుచున్నాను. కాబట్టి వెంటనే ఈ ప్రభుత్వం ఈ భూసంస్కరణల సమస్యను పరిష్కరించే పద్ధతిని అమలు పరచవాలి, మన ఆంధ్ర ప్రభుత్వం, తెలంగాణా ప్రజలతోచేరి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని నిర్మించుకొనే ముహూర్తం రాకమునుపే ఈ ప్రయత్నంచేసి, ప్రజల అభిమానాన్ని చూరగొనునట్లు మన ప్రభుత్వం ప్రయత్నంచేస్తే బాగా ఉంటుందని నేను ఆశిస్తున్నాను. వ్యవసాయం తరువాత చేనేత ప్రధానమైనది మన కోటయ్యగారు ప్రసంగించారు. చేనేత పరిశ్రమకు సంబంధించినంతవరకు కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన సహాయం, నేరుగా చేనేత పారిశ్రామికులకు చెందడంలేదు. కేవలం ఏదో మధ్యరకంగా, కొన్ని పనిముట్లు రూపకంగా ఆ పరిశ్రమకు సంబంధించినంతవరకు మన కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు చేయుచున్న కృషి, సమగ్రంగా చెప్పారు అయితే

వారు వదలిపెట్టిన విషయాన్ని మాత్రం ప్రభుత్వ దృష్టికి తీసుకొని వస్తున్నాను. ముఖ్యంగా ఈనాడు కేంద్ర ప్రభుత్వ ఆదేశానుసారం, మన దేశం మొత్తంపైన 35 వేల మర మగ్గాలను చేనేత society ల లో అమలు పరచి, వస్త్రోత్పత్తిని క్రమంగా పెంచవలెననే సంకల్పంతో కేంద్ర ప్రభుత్వం ముందంజవేసింది. ఈ ప్రయత్నం చేనేత పారిశ్రామికులకు, విపరీతమైన, శాశ్వతమైన నష్టాన్ని కలిగిస్తుందని చెప్పుచున్నాను. చేనేత పారిశ్రామిక సంఘాలు, చేనేత పరిశ్రమలో కృషిచేయు నాయకులు దానిపై అభిమానంగలిగిన అనుభవజ్ఞులు, పెద్దలు అందరు కూడా ఆందోళనచెంది ప్రభుత్వానికి తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. అయితే మన ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వం చేనేత కార్మికులు పడుతున్న బాధలను బాగా గమనించి ఒకప్పుడు వారికి గంజి కేంద్రాలు తెల్పించి, జీవనోపాధి కల్పించి, కావలసినంత సహాయం, సానుభూతి చూపించిన మాట వాస్తవం. అయితే ఈనాడు చేనేత పరిశ్రమకు ఆంధ్ర ప్రభుత్వం ఆదరణ అభిమానాలు చూపుతూ మన శాసనసభ ద్వారా కేంద్ర ప్రభుత్వానికి ఏకగ్రీవంగా చేనేత పరిశ్రమకు చీరెలు, ధోవతులు ఖచ్చితంగా కేటాయించడం అత్యవసరమైన పని అనియు ఈ పరిశ్రమకు రక్షణ ఇవ్వవలసినదని ఖచ్చితంగా ఈ ప్రభుత్వ అభిప్రాయాన్ని పంపించారు. దానిపైన కేంద్ర ప్రభుత్వం కదలలేదు. ఏ విధమైన టువంటి తీర్మానం యింతవరకు చేయలేదు. ఇప్పుడు ఆ రూపం కాకుండా, కనుంగో కమిటీవేసిన తర్వాత ఆ కమిటీ సూచించిన ప్రకారం ఈనాడు మర మగ్గాలను అమలు పరచే ప్రయత్నం చేస్తున్నారు. అయితే మన ప్రభుత్వం రాష్ట్రములో నూలు మిల్లులు ప్రారంభించే ప్రయత్నానికి మాత్రం సావకాశం కల్పించింది. చాలా సానుభూతిలో మన ప్రభుత్వం ప్రయత్నం చేస్తూవున్నది. అయితే వస్త్రాలు ఉత్పత్తి చేయు మిల్లుల స్థాపనకు మాత్రం ఏలాంటి సహాయం ఇవ్వలేదు. ప్రోత్సాహం కన్పించదు. అందుకు ప్రభుత్వాన్ని నేను ప్రత్యేకముగా అభినందించవలసినదే. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రభుత్వం ఈనాడు ఖచ్చితమైన అభిప్రాయాలను శాసనసభ ద్వారాగాని లేక తమ మంత్రి వర్గం హోదాలోగాని కేంద్ర ప్రభుత్వానికి ఆంధ్ర దేశంలో చేనేత సహకార సంఘాలలో మర మగ్గాలు పెట్టడం చేతి మగ్గాలకు, చేతి మగ్గాలమీద జీవనాధారం గడుపుకునే లక్షలాది ప్రజల—పొట్టలమీద కొట్టినట్లవుతుంది. ఆ పరిశ్రమకు దెబ్బ పడుతుంది అన్న అభిప్రాయాన్ని కేంద్ర ప్రభుత్వానికి, మన ప్రభుత్వం తమ అభిప్రాయమును చెప్పే ప్రయత్నం చేస్తుందని నేను విశ్వసిస్తున్నాను. ఇది కాకుండా చేనేత మగ్గములకు Registration పద్ధతి అమలు పరుస్తున్నారు.

చేనేత మగ్గాలను జిల్లాలలో ఉన్న కో ఆపరేటివ్ సంస్థల ద్వారా పనిచేయు చేనేత మగ్గముల వారు తమ దరఖాస్తులను తీసికొని పేర్లను వ్రాయించి, తరువాత ప్రభుత్వం వారికి 6 మాసాలకు ఒక్క పర్యాయము తనిఖీచేయు పద్ధతి అమలు జరిపిన బాగుండును. చేనేత పారిశ్రామికులలో నూటికి 70 మంది చదువుకొన్న వాండ్లు కూడ లేరు. అట్లాంటప్పుడు, registration చాలా కష్టం. అధికారులు చూపే క్రూర దృష్టికి, పెట్టే ఇబ్బందులకు, గురికావాలసి ఉంటుంది. వారిని ఇటువంటి ఇరుకు బాటల క్రింద పెట్టే ప్రయత్నం చేనేత వారి మెడకు ఉరితాడు, వారి చేతులకు సంకెళ్లు వేసినట్లు అవుతుంది అందువల్ల ఈ registration పద్ధతి ఎంత మాత్రం క్షేమకరం కాదు. అందువల్ల ఈ విషయాన్ని మన ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి నచ్చచెప్పే ప్రయత్నం చేస్తారన్ని ఆశించుతున్నాను.

తరువాత హరిజనులు, గిరిజనులు, సిరిజనులు, పురజనుల విషయమంతా చాలా అభివృద్ధికరంగానే ఉన్నట్లు గవర్నరుగారి ప్రసంగంలో కనపరిచారు. అయన చెప్పినదాన్ని నేను ఆమోదిస్తున్నాను. తర్వాత గ్రామోద్యోగుల విషయం, రెడ్డి కరణాలు ఉన్నారు. ప్రభుత్వంలో పైన మంత్రులున్నారు. క్రింద అడుగు భాగంలో రెడ్లు కరణాలు ఉన్నారు ఈ ఇద్దరి మధ్య ప్రభుత్వయంత్రాంగానికి ఆధార భూతమైన పల్లె ప్రజలున్నారు. గ్రామోద్యోగులకు ఇస్తున్న వేతనాలు చాలవని, వారినుండి రాబట్టు కార్యక్రమం చాల పెద్దదని ఈనాడు ఆంధ్రదేశం మొత్తంమీద ఆందోళన జరుగుతూ ఉన్నది. ప్రభుత్వము వద్దకు రాయబారాలు పంపినారు. ప్రభుత్వం వారు, వారి కష్టాలను విన్నారు. ఏదో ఒక విధమైన సహాయం చేస్తామని చెప్పారు. చేసే సహాయాన్ని ఖచ్చితంగా చెప్పి (జీతములు పెంచుతారో, వైద్య, సౌకర్యం ఇస్తారో, విద్యా సౌకర్యం ఇస్తారో) ఈ సమావేశం ముగిసేలోపల, సానుభూతితో చూస్తామని చెప్పకపోతే వీండ్లయొక్క ఆందోళనసాగి అశాంతి ప్రబలుతుంది. కాబట్టి అది కలుగకుండా ఈ ప్రభుత్వం వారు, ప్రత్యేకముగా ముఖ్యమంత్రిగారు తగిన చర్య తీసుకొన ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను.

The Hon. Dr B GOPALA REDDI అప్పుడే వారికి చెప్పవలసినది అంతా చెప్పాము. వాండ్లుకూడ ఆందోళన విరమించుకొంటారని ఆశిస్తున్నాను. వాండ్లకు వైద్య, విద్యా సౌకర్యములు అన్నికూడా చేస్తామని చెప్పాము.

Sri S. NARAYANAPPA అందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. చర్య తీసుకొని వాండ్లను సంతృప్తి పరచడం చాల ప్రశంసనీయంగా ఉన్నది. తరువాత జిల్లా బోర్డుల సంగతిమాత్రం ఒకటిచెప్పి నా ఉపన్యాసాన్ని ముగిస్తున్నాను. ఈ special ఆఫీసర్ల పరిపాలన క్రిందపడి జిల్లా బోర్డులు మిక్కిలి నలిగిపోయినాయి. కలెక్టర్ల చేతిలో జిల్లా బోర్డు పరిపాలనను పెట్టడం, చరిత్రలోగాని constitution లోగాని కనిపించదు. ఇది ఎందుకు చేస్తున్నారో అనే సంశయము మనకు తప్పక వస్తుంది. December సమీపిస్తున్నది. మనం తెలంగాణాలో కలుసుకొంటున్నాం. ఆంధ్ర ప్రదేశ్ ఏర్పడుతుంది. ఎన్నికలు జరుపుతారా అంటే, జరపడానికి అవకాశాలు లేవు. వెంటనే పార్లమెంటు electionలు రాబోతున్నవి. కాబట్టి జిల్లా బోర్డు electionలు జరపడానికి వీలు లేదని చెప్పి తిరిగి వాయిదా వేస్తుంది ప్రభుత్వం. ఇటీవల జిల్లా కలెక్టర్ల క్రింద ఒక సలహా సంఘాలను వేశాం. ఆ సంఘాల ద్వారా ప్రజలు తమ కోర్కెలను తీర్చుకొనేటటువంటి సావకాశం ఉంది. ఈ విధమైన ప్రయత్నం చేస్తున్నామని గవర్నరుగారు తమ ప్రసంగంలో చెప్పారు. ఈ సలహా సంఘాలు ఏ విధంగా ఉన్నాయంటే కోతి నెత్తిమీద కుళ్లాయి పెట్టినట్లే ఉంది. అంటే కలెక్టరును ప్రెసిడెంటుచేసి, మంచి దిగ్గజాలవంటి సర్వ స్వతంత్రాలు అనుభవించినట్టి, జిల్లా బోర్డు ex-president లను, వారి క్రింద కమిటీ మెంబర్లుగావేయడంవల్ల కలెక్టర్లు, వారి సలహాలను వింటే వినవచ్చును. నిరాకరిస్తే నిరాకరించవచ్చును. ఆ విధమైన discretion collector ల చేతిలోపెట్టి ఈ గౌరవనీయులగు సభ్యులను ఆ సలహా సంఘంలో ఎనిచేయండని నియమించడం చాల శోచనీయమైన విషయం. చాల విచారకరమైన సంగతి. మిక్కిలి హాస్యాస్పదంగా కూడా ఉంటుంది. ముఖ్యమంత్రిగారు, నిజమైన ప్రజాస్వామ్యాన్ని జిల్లాలలో మరల నెలకొల్పవలెనంటె, ఎన్నికలైనా పెట్టండి. లేదా ఎన్నికలకు సమానమైనటువంటి indirect election ఏదైనా ఒక పద్ధతి ద్వారా తీసుకొనివచ్చి జిల్లా బోర్డులలో స్వతంత్రంగా ప్రజా ప్రభుత్వ పరిపాలన జరిగేటట్లు మన మంత్రి వర్గంవారు ఆలోచనచేసి, ఆ ఆలోచనను అమలు పెట్టే ప్రయత్నం చేస్తారని ఆశిస్తూ ఇంతటితో ఉపన్యాసం ముగిస్తున్నాను.

Sri E. AYYAPU REDDI · అధ్యక్ష మహాశయా, శ్రీ వేమారెడ్డి గారి తీర్మానమును నేను హృదయపూర్వకముగా బలపరుస్తున్నాను. గవర్నరుగారి ప్రసంగంలో ముఖ్యంగా మా నియోజకవర్గంలో ఉన్నటువంటి ఒక ముఖ్యమైన

రహదారిని గురించి వారు చెప్పుతూ, నంద్యాల నందికొట్కూరు రోడ్డుకుగాను 9 లక్షల రూపాయలను కేటాయించామని, ఇది త్వరలో రూపం దాల్చడానిక్కి సిద్ధంగా ఉన్నదని చెప్పినప్పుడు నేను, నా నియోజక వర్గంలోని ప్రజలూ అమితానందాన్ని పొందినాము. గవర్నరుగారి మొదటి ప్రసంగములోనే నేను ఈ రహదారిని గురించి చెపుతూ, 'రాయలనాటి కాలంనుంచి ఇంతవరకూ వేరు రహదారిమార్గం లేకుండా చారిత్రాత్మకమైనటువంటి, శిలా శాసనములతో కూడుకొన్న చోట మేము దుఃఖ ముతో మునిగిపోతున్నామని' చెప్పాను. ఆనాటి మా విన్నపం ఈ రోజు ఒకరూపాన్ని పొందిందంటే, వాస్తవానికి అందని అంతరిక్షంలో ప్రత్యక్షమయ్యే మా ఊహా సౌధాలన్నీ ఈ దినం రూపం పొందినాయని చాలా సంతోషిస్తున్నాము "శకముల విన్నపం శశాంకుడు విన్నాడు" అన్న అర్థంకూడా ఈ రోజున దానియొక్క ప్రత్యే కతవల్ల వినిపించింది. ఈ 192 మంది సభ్యులు తమతమ నియోజక వర్గాలలోని తమ ప్రత్యేకమైన కోర్కెలను అన్నిటినీ విన్నవిస్తుంటే అది ఏనాటికి అయినను ఒకరూపమును పొందగలదా ? వాటిని వినేవారు ఉంటారా ? విని పరిశీలించేవా రుంటారా ? పరిశీలించిన పిమ్మట దానిని సత్కరించేవారుంటారా ? అన్న సందే హాలతో కూడుకొంటున్నటువంటి ఈ సందర్భంలో, మాయొక్క విన్నపం ఇంత త్వరలోనే ఒక కార్యరూపమును పొందిందని తెలుసుకొనే దానికి ఎంతనో ఆనం దిస్తున్నాను

అంతేకాకుండా ఈ ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఈ మొదటి సంవత్స రంలో ఈ ఆంధ్రరాష్ట్రానికి అంతాకలిసి 3 High Schools ను ఏర్పాటు చేయవలసి ఉన్నది. 3 హైస్కూళ్లలో కర్నూలు జిల్లాలో మా నియోజక వర్గమైన నంది కొట్కూ రులో, ముఖ్యమంత్రిగారు చాలా శ్రద్ధతీసుకొని, మాపైన అభిమానంతో ఈ సంవ త్సరమే జిల్లా బోర్డుయొక్క ఆధ్వర్యాన నెలకొల్పినారు. ఈ నెల 18 వ తేదీన ముఖ్యమంత్రిగారి ఆధ్వర్యంక్రింద దానికి ప్రారంభోత్సవం జరుపవలసి ఉండినది. కాని కొన్ని అవాంతరాలవలన ప్రారంభోత్సవం జరుపబడనప్పటికీ ఆ High School మాత్రం ప్రారంభంకాబడి, ఇప్పుడు ఒక రూపాన్ని దాల్చినందులకు, మేము ముఖ్య మంత్రిగార్కి మా హృదయపూర్వకమైన అభివందనాలను తెలియచేస్తున్నాం. మా నియోజక వర్గానికి ప్రత్యేకంగా 20 లక్షలు రూపాయలు ఖర్చు పెట్టి శ్రీశైల క్షేత్రానికి ఒక మహత్తరమైనటువంటి రోడ్డును ఏర్పాటు చేశారు. విద్యుచ్ఛక్తి కూడా మా

నియోజక వర్గంలో ప్రవేశించింది. ఇక మాకు కావలసినటువంటి కోర్కెలు కూడా అట్టే ఎక్కువలేవు, 5-6 సంవత్సరములలో సాధించవలసిన విషయాలను మనము సంవత్సరములోనే సాధించుకోగల్గినందులకు చాల కృతజ్ఞత తెలుపుతూ ఇకమీదట ప్రభుత్వాన్ని మా నియోజక వర్గంగూర్చి ఎక్కువగా బాధించ దలచలేదని వార్కి ప్రత్యేకంగా మనవి చేస్తున్నాను. ఈ విషయాలలో నేను ప్రభుత్వంయొక్క ప్రధాన విధానాలను గురించి చర్చించవలసినటువంటి ఆవశ్యకత లేనప్పటికీ ప్రభుత్వం నడుపుతున్న యంత్రాంగాన్ని గురించి కొంత చెప్పదలచుకొన్నాను. ఇపుడు సాధించవలసినటువంటి కార్యక్రమాలన్నీ కూడా కాంట్రాక్టర్ను ద్వారానే నెరవేర్చవలసి ఉన్నది. ప్రభుత్వ నిర్మాణంలో, ఒక్కరోడ్డు నిర్మాణంకాని, ఒక ఎలెక్ట్రిసిటీ విషయంకానీ, కెనాల్సు విషయంకానీ, మరే కార్యక్రమాన్ని ప్రభుత్వం సాధింపవలసినప్పటికీ కూడా కాంట్రాక్టర్లు ద్వారానే సాధింపవలసి ఉన్నది. ఈ కాంట్రాక్టర్నును ఏర్పాటుచేసుకొని, ఈ విధంగా నిర్మాణ కార్యక్రమాలన్నీ జరిపడంలో పాప్యం జరగడమే కాకుండ వ్యర్థవ్యయంకూడా ఎక్కువగా జరుగుతోందని అందరికీ తెలుసు ఈ వ్యర్థవ్యయం జరగడంలో కొన్నికొన్ని చిన్న ఉదాహరణలను చూచినప్పుడు చాలా వింతగా కనబడుతుంది. చిన్న ఉదాహరణ: ఎలెక్ట్రిసిటీ పోల్సును నాటేదానికోసం, గుంత త్రవ్వేదానిక్ 5 రూపాయలు, ఒక ఎలెక్ట్రిక్ పోలును paint చేసేదానికి 3 రూపాయలు మొదలుకొని 4 రూపాయలవరకు ఉన్నది Estimates వేయడం ఆవిధంగా చాల వ్యర్థమైన వ్యయం జరుగడంకూడా నాకు కొద్దిగా తెలుసు. Private Contractor దీంట్లో ఖర్చు పెట్టేది దాని- ఇచ్చిన Estimates లో 10/19 భాగంకూడా లేదు ఈ విధంగా ప్రభుత్వం డబ్బు చాల వ్యయమై పోటున్నది ఈ చిన్న ఉదాహరణతోనే నేను విరమించుకుంటూ దీనికి గాను ప్రభుత్వం వెంటనే ఒక Estimates కమిటీని వేసి ఇకముందు జరుగవలసిన నిర్మాణ కార్యక్రమాలనన్నిటినీ కూడా బాధ్యతతో కూడినటువంటి శాసనసభ్యులు, తరువాత దేశంలో ముఖ్యంగా Responsibility తెలిసిన నాయకులతో ఒక Estimates Committee జరుగవలసినటువంటి నిర్మాణ కార్యక్రమంలో ప్రభుత్వానికి ఎంత వ్యయం కావలెను ఎంతవ్యయం అవుసరంలేదు, అనే విషయాలు నిర్ణయించుటకు ఒక కమిటీని ఏర్పాటు చెయ్యాలని ప్రభుత్వానికి విన్నవిస్తున్నాను.

జిల్లా బోర్డుల విషయాలను గురించి చాలమంది సభ్యులిదివరకే వివరించి ఉన్నారు. జిల్లాబోర్డులను గురించి చెప్పడం రోకటి పాటగా ఉంటుంది. ఇటీవల

ప్రభుత్వం ఏర్పాటుచేసినటువంటి జిల్లాబోర్డు సలహా సంఘసభ్యులలో నేనుకూడా ఒక డిని. ఈ జిల్లాబోర్డు వ్యవహారాలన్నీ నిశితంగా పరిశీలించినప్పుడు అవి చాల దుఃఖ కరమైనటువంటి, విషాధకరమైనటువంటి విషయంగా పరిణమిస్తుంది. ఇంతవరకూ కూడా చాలా కార్యక్రమాలకు పూనుకొని ఉన్నారు. రోడ్లు వేసేదానిక్కి, bridges ను కట్టేదానిక్కి, స్కూళ్లను కట్టేదానికి అన్నీకూడా సగంలో నిలబడి పోయినాయి. పూర్తిచేసెదానికి డబ్బులేదు. పూర్తిచేయకుండా ఉండటానికి ఇంతవరకు వ్యయం చేసిన డబ్బంతా వ్యర్థమైపోతుంది. వీటిని ఏవిధంగా నైనా పూర్తిచేయాలని ఒక ఉబలాటాన్ని మేము ప్రకటించినప్పుడు, దీనికి తగినంత డబ్బులేదు. ఆర్థిక స్తోమతులేదు. దీన్ని ఏవిధంగా పూర్తి చేస్తామంటున్నారు. జిల్లాబోర్డు Special Officers. ఈ అభాసకరమైనటువంటి ఈ అసంపూర్ణ రామాయణానికి ఎప్పుడు స్వస్తివాచకం చెప్పుతారో దానికొరకు మేమంతా ఎదురు చూస్తున్నాము. జిల్లాబోర్డులను పూర్తిగా రద్దుచేసి కేవలం ప్రభుత్వం తీసుకోవాలని ఒక విధమైనటువంటి సూచనగా నేను చేయ దలచుకొన్నాను. లేక వాటికి తగినంత ఆర్థిక స్తోమతు నిచ్చి ప్రత్యక్షమైన ఎన్నిక లను జరిపి బాధ్యతతో కూడుకొనిన అధ్యక్షులతో వాటిని సక్రమంగా నిర్వహించే పద్ధతిలో నైనను చూడవలసిన ధర్మం ప్రభుత్వముపైనున్నదని, వారిక్కి నేను విన్నవిస్తున్నాను

ఇటీవల మనం pass చేసిన చట్టాలలో Court Fee Act ను గురించి నేను ప్రభుత్వానికి ఒక విన్నపం చేయదలచుకొన్నాను. Court Fee Act ను చాలా కొద్దికాలంలో, Select Committee లో నేనుకూడా ఒక సభ్యునిగా ఉండినప్పటికీ, చాల ఎక్కువగా విమర్శ చేయకుండా చాల త్వరగా pass చేసినాము అనుకుంటు న్నాను. Court Fee Act వలన చాల కష్టాలు, నష్టాలు, దుర్భరమైన పరిస్థితులు కూడా కొన్నికొన్ని సందర్భాలలో కలుగుతున్నాయి. న్యాయాన్ని అర్థించివచ్చిన litigents ఈ Court Fee Act వలన దెబ్బతిని తమయొక్క హక్కులకోసం పోరాడలేని పరిస్థితులుకూడా కొన్ని సంధర్భాలలో కల్గినాయి. ఈ Act ను ప్రభుత్వం ఎంతవరకు ఉపయోగ పడుతున్నది, ఆర్థికంగా ఎంతవరకు ఇది లాభదాయకంగా ఉన్నదో ప్రభుత్వాన్ని ఒక కమిటీ వేసో లేక ప్రభుత్వంతరఫున ఒక సలహాసంఘాన్ని ఏర్పాటు చేసో త్వరగా పరిశీలన చేయాలని కోరుతున్నాను.

ఈ Act క్రింద అట్టే ఆదాయం రాదని నా ఉద్దేశ్యం. ఈ Act నిష్ప్రయోజన మవ్వడానికి కృషి జరుగుతోంది. కాబట్టి దాని ఆశయాన్ని సాధించలేదని ప్రభుత్వానికి

మనవిచేయుచున్నాను. హిందువారసత్వపు బిల్లును కేంద్రప్రభుత్వం pass చేసింది. హిందువారసత్వ బిల్లు భూములకు అనువర్తిస్తుందా లేదా అనే విషయంమీద తీర్జన భర్జనలు జరుగుతున్నాయి. దీనిని గురించి Advocate-General తోనో లేక, ఇతర experts తోనో సంప్రదించి భూములకు అనువర్తిస్తుందా లేదా అనే విషయం తేల్చు కొని, లేకపోతే వారి విధానం ఏమిటో తెలియజేయవలసి ఉంటుంది. ఈ బిల్లును భూములకు అనువర్తింపదలచుకొన్నయెడల estate duty ప్రకారం ఈ బిల్లునుగూడా అసెంబ్లీలో pass చేయవలసిందని కోరుతూ, అవకాశం ఇచ్చినందులకు అధ్యక్షుల వారికి కృతజ్ఞత చూపుతూ విరమిస్తున్నాను.

The Hon Dr B. GOPALA REDDI Agricultural lands కు ఇది వర్తిస్తుందా లేదా అనే విషయం నేను Law Department వారిని అడిగినాను.

Sri E AYYAPU REDDI అనువర్తిస్తుందని చెప్పారా? అనువర్తింప దని చెప్పినారా?

The Hon Dr. B GOPALA REDDI ఇంకా answer రాలేదు I have just asked that point to be examined because Sri R B. Ramakrishna Raju has raised that point

Sri G YELLAMANDA REDDI అధ్యక్షా, గవర్నరుగారిచ్చిన ఉప న్యాసం విన్నతరువాత మా జిల్లాకు సంబంధించిన 1, 2 విషయాలను ప్రభుత్వం దృష్టికి తీసుకురావలచినాను నాగార్జునసాగర్ ప్రాజెక్టు నిర్మాణం విషయమై గవర్నరు గారు ఉపన్యాసంలో చెప్పినారు. ఆ ప్రాజెక్టు సమస్యను గురించి 2, 3 సంవత్సర ములనుంచి ప్రజలలో ఆందోళనలున్నాయి. అయినప్పటికీ కూడా 2 ముఖ్య విషయాలు ప్రభుత్వ దృష్టికి రాలేదు. ఈ ప్రాజెక్టును 2 దశలలో కాకుండా, ఒకేదశలో పూర్తి చేయాలని మేము అనేక సందర్భాలలో చెప్పివున్నాము, Public works శాఖ మంత్రిగారుకూడ ఒకేదశలో చేస్తే బాగుంటుందని ఒప్పుకొని, అందుకు తగిన కృషి చేస్తానని హామీ యిచ్చారు. దాని విషయమై ప్రభుత్వం ఎటువంటి కృషిచేసిందో, ఫలితం ఏమిటో తెలియచేయలేదు. రెండు దశలలో చేసినట్లయితే ప్రజలకూ, ప్రభుత్వానికీ కూడా చాలా ఇబ్బందులున్నాయి. ప్రభుత్వంవారు తయారు చేయించిన పుస్తకంలో ఖర్చులదృష్ట్యానే రెండు దశలుగా చేయుటకు నిర్ణయించామని వుంది.

నిర్మాణం దృష్ట్యా 2 దశలున్నట్లయితే మాకు ఏమాత్రమూ ఆక్షేపణ లేదు పని పూర్తయిన భాగంలో నీరు ఇవ్వడానికి ఎట్టి అభ్యంతరమూ లేదు. ఈ విధంగా వుండడంవల్ల ప్రభుత్వానికి కూడా లాభం వుంటుంది. ఖర్చు రీత్యా 2 దశలని నిర్ణయిం చితే మొదటి దశలో కొంతభాగం పూర్తయిన తరువాత రెండవ దశకు మళ్లీ ప్రభుత్వం యొక్క మంజూరు కావాలి, ఇందువల్ల అనేక సాధక బాధకాలున్నాయి. తుంగభద్ర హైలెవెల్ ఛానల్ పరిస్థితి చూచినవారికి ఈ విషయం బాగా అర్థమవుతుంది. ఒకదశలోనే దీని నిర్మాణం పూర్తి అగుటకు, ఖర్చుకు సంబంధించిన విషయాలను పరిశీలించి వెంటనే కేంద్రప్రభుత్వామోదాన్ని రాబట్టాలని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఎగువ కాల్వల విషయంలో మొదటి దశలో 7,500 క్యూసెక్కులు, 2 వ దశ వచ్చేటప్పటికి మరల కాల్వను వెడల్పు చేయాలనే సూచన లున్నట్లు ఆమధ్య పత్రికలలో చదివాము. వాటిని కేంద్రప్రభుత్వం తిరస్కరించిందని కూడా విన్నాం. ఇందుకు చాలా సంతోషం. ఎగువ కాల్వ నిర్మాణం విషయంలో ఎక్కువ డబ్బు ఖర్చు అవుతుందని, దానికి కేంద్రప్రభుత్వం అంగీకరించదనే అనుమానాలు తగ్గినందుకు చాలాసంతోషం. ఈ ఎగువకాల్వ పరిశీలనాధికారులు తక్కువ ఖర్చుతోనే ఎక్కువ నీటిని తీసుకురావడానికి అవకాశమున్నట్లు ప్రభుత్వానికి సూచించారని తెలుస్తున్నది.

ఎగువకాల్వను పరిశోధన చేస్తున్నవారు చెప్పినవేకాకుండా ఖోస్లా కమిటీవారు సూచించిన విధంగా కృష్ణా, గుంటూరు జిల్లాలలోని మెట్టప్రాంతాలను కూడా సాగులోనికి తీసుకురావడానికి కేంద్ర ప్రభుత్వామోదాన్ని సంపాదించవలసిన అవసరం ఉందని మనవి చేస్తున్నాను ఎందుచేతనంటే ఏకాల్వ నిర్మాణం విషయమైనా కేంద్రజల విద్యుచ్ఛక్తి సంఘ అధ్యక్షుని ఆమోదం కావాలని తెలుస్తున్నది. వారు నిర్ణయించుటకు ముందుగానే మన ప్రభుత్వం కృషిచేసి తప్పకుండా వారి ఆమోదాన్ని పొందడానికి కృషిచేయాలి. లేనినాడు వారి అంగీకారం లభించదు. ఎగువ కాల్వ విషయంలో మనప్రభుత్వం శాయశక్తులా కృషిచేయాలి. ముందుగా కావలి—కనుపూరు కాలువను తీసుకోడానికి ప్రభుత్వం అంగీకరించినట్లు తెలుస్తున్నది నాగార్జునసాగర్ బోర్డువారు కూడా అంగీకరించవలసిన అవసరం ఉన్నది. దానిని కేంద్రప్రభుత్వం ద్వారా అంగీకరించేటట్లు చేసుకొని పని ప్రారంభించినట్లయితే ప్రజలలోని అనుమానాలను తొలగించడానికి అవకాశముంటుందని భావిస్తున్నాను.

సోమశిల విషయం చాలా రోజులనుంచి చర్చలోవున్నది. మన ప్రభుత్వం వారు దానిని flood control గా తీసుకొంటామన్నారు. కాని అది కూడ లాభంలేదనుకొంటున్నాను. దాని విషయమై ప్రభుత్వంవారు ఏమినిర్ణయించారో తెలియక ప్రజలు చాలా ఆందోళన చెందుతున్నారు.

ఇప్పుడు అనేక ప్రాజెక్టులను ప్రభుత్వంవారు నిర్ణయిస్తున్నారు. మన రాష్ట్రంలో ఈ ఒక్క ప్రాజెక్టు మిగిలిపోతోంది. దీనివిషయమై ప్రభుత్వం ఏమి కృషిచేసిందో తెలుపకోర్తాను. వెనుకబడిన ప్రాంతాలవారికి ఎక్కువ ప్రాధాన్యం యివ్వాలని రెండవ పంచవర్ష ప్రణాళికలో సూచింపబడింది. కాని ఆచరణలో మాత్రం సరిగా జరగడం లేదని తెలుస్తోంది నెల్లూరు జిల్లాలో Local development కు Schemes కు ఇచ్చిన ధనమంతా నెల్లూరు, కోవూరు తాలూకాలకు మాత్రమే ఖర్చు పెట్టినారు. అట్లా ఖర్చుచేయడం తప్పని నాఅభిప్రాయం కాదు. ఆ రెండు తాలూకాలలోనూ తప్ప, మిగిలిన 11 తాలూకాలలోనూ ఏవిధమైన పనులు జరుగలేదని తెలుపుటకు చాలా విచారిస్తున్నాను. దీనికి సరైన పద్ధతులను అవలంభించవలసిన అవసరం ఉందని తెలియచేస్తున్నాను.

Red tapism విపరీతంగా ప్రబలిపోయిందని చెప్పడానికి చింతిస్తున్నాను. మెట్ట తాలూకాల్లో సగం డబ్బు యిస్తామని చెప్పినారు. కాని ఒకటికూడా జరుగుట లేదు. అక్కడ Collector Office కు, Engineering Office కు, Planning Office కు తిరిగి, ఆ గుమాస్తాలను పట్టుకొని ఆ కాగితాలు తెచ్చుకోడమే బ్రహ్మ ప్రళయమై పోతుంది, వెనుకబడిన ప్రాంతాలు అభివృద్ధి చెందడానికి తగిన మార్గాలను ఆలోచించాలి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో వచ్చే అనుభవాలను పురస్కరించుకొని ఈ సమస్యను పరిష్కారం చేయాలని కోరుతున్నాను.

జాతీయ విస్తరణ ప్రణాళికలను కూడా నెల్లూరు జిల్లాలోనే అమలు జరిపినారు. వెనుకబడిన తాలూకాలు ఇంకా 13 వుండగా అక్కడే అమలు చేయడం ఏమిన్యాయం? ఆ పద్ధతి ప్రకారం 2వ దఫా కోవూరు, ఆత్మకూరు తాలూకాల్లో అమలు జరుపుతారు. వెనుకబడిన ప్రాంతాలకు అవకాశం లేకుండా పోతోంది. Contiguity అనే సూత్రాన్ని వదలిపెట్టి అన్ని ప్రాంతాలకు అవకాశం వుండే యేర్పాటు చేయాలని కోరుతున్నాను.

ఈ పద్ధతివలన మా జిల్లాలోని కాంగ్రెసు పార్టీవారు, కమ్యూనిస్టు పార్టీవారు కూడా అసంతృప్తి చెందుతున్నారు. ప్రభుత్వం ఈ పద్ధతిని మానుకోవాలని కోరుతున్నాను.

విద్యుచ్ఛక్తి విషయంలోకూడా వెనుకబడిన ప్రాంతాలకు చాలా అన్యాయం జరుగుతున్నది. దానిని గిట్టుబాటును గురించి ఏదో లెక్కలువేస్తూ కాలం గడుపుతున్నారేగాని ముందుగా వెనుకబడిన ప్రాంతాలకు యిచ్చి రైతులకు ఉత్సాహం కల్గించాలనే ఉద్దేశ్యం వున్నట్లు కనబడదు.

ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో నెల్లూరు జిల్లాలోని వెనుకబడిన ప్రాంతాలకు 50 లక్షల రు॥ల ఖర్చుతో మాచ్ ఖండ్‌నుంచి విద్యుచ్ఛక్తిని సప్లయిచేయడానికి ఒక పథకం తయారుచేసిందని తెలుస్తున్నది. దానిని వెంటనే అమలు జరపాలి దీనికి ప్రజలు తప్పకుండా సహకారం ఇస్తారని నేను హామీ ఇవ్వగలను.

Forest విషయంలో కొన్ని ఇబ్బందులు ఉన్నాయి. ఇవి చాల విడదీయరాని చిక్కుగా తయారౌతున్నాయి ఇప్పుడు ప్రభుత్వము వారు మా మొర విని ఉద్యోగస్తులకు గట్టి ఆర్డర్లు ఇచ్చారు, కాని వాళ్లు కేసులు book చేస్తున్నారు. మేకలను గొఱ్ఱెలను పట్టుకొన్నట్లయితే వాటిని వెంటనే దొడ్డికి పెట్టడం దొడ్డి వన్ను కట్టడం జరుగుతోంది. షుమారు రెండు మూడు నెలలలో 5, 6 కేసులు నేను పరిష్కారం చేశాను D F.O దగ్గరికి వెళ్లి compound కు మేక 1 కి 10 రూ॥ల చొప్పున ఇవ్వలేము '2 రూపాయలే ఇస్తామని' ఒప్పుకొని రావడం జరిగింది. ఇది ముఖ్యంగా taken over estate గ్రామాలలో Government వారి Survey settlement ఇంత వరకు జరగకపోవడం మూలంగా ఇది చాల తీవ్రమైనటువంటి సమస్యగా రోజు రోజుకు పరిణమిస్తున్నది. దీనికి ప్రభుత్వం తీవ్రమైనటువంటి చర్యలు తీసుకోవాలని నేను మనవి చేస్తున్నాను. వ్యవసాయ శాఖా మంత్రిగా ఓబుల రెడ్డిగారు వచ్చినందువల్ల ప్రత్యేకంగా దీనిమీద కృషి జరుగుతుందని ఆశించాము. కాని అదేమి మాకు కన్పించడం లేదు. కృషిలేదు, ఫలితంలేదు, అనే వ్యవహారంగా సాగిపోతున్నట్లు కనబడుతోంది ముఖ్య మంత్రిగారికి చాల port folio లు ఉన్నాయి. ఇవన్నీ నిర్వహించడం చాల కష్టంగా ఉంటుందని అభిప్రాయపడే వాళ్లము. ఇప్పుడు రైతు సేవకుడనని చెప్పుకునే ఓబుల రెడ్డిగారు వచ్చారు కాబట్టి వీటన్నింటిని పరిష్కారం చేస్తారని మేము ఆశిస్తే అదేమీ మాకు కనబడడంలేదు. అందువల్ల ఈ forest వ్యవహారంలో తక్షణం

Survey Settlement చేయడము, కేసులు పెట్టే వ్యవహారంలోనైనా కనీసం Local M L.A తో consult చేసి కేసుపెట్టి వ్యవహారం చేసినట్లయితే కొంతవరకు మేలుగా ఉంటుంది ఏదైనా ప్రభుత్వం ఆలోచించాలి. లేకపోతే మార్గమేమి కన్పించడం లేదు. ఎట్లాగో దొడ్డికి తోలుతారు, తోలిన తర్వాత 1 రూ, ½ రు కట్టుకొంటారు. తరువాత Case పెడితే with draw చేయడానికి వీలులేదు. కాబట్టి వెంటనే కేసు పెట్టకుండా ఉంచే పరిష్కార మార్గాన్ని వెతకటానికి వీలు ఉంటుందేమో ఆలోచిం చాలి. ప్రతి గ్రామముకూడా compound పడిన గ్రామమే. మేక ఒకటికి 10 రూపాయలు 5,3,2,1 ½ రూ. చొప్పున వాళ్ళ ఇష్టమువచ్చినట్లు కట్టుకుంటారు. కేసులు పెట్టేవాళ్ళ పెడుతున్నారు. పైకి న్యాయంగా ఉన్నట్లు వాళ్ళ 2 రూ॥లు అంటే మనం బేరమాడితే ½ రు. 6 అణాల వరకు తీసుకొంటారు. నెల్లూరు జిల్లాలో పడమటి ప్రాంతమంతా forest ప్రాంతం. అందువలన ఈ సమస్యను ప్రభుత్వము తక్షణము తీసుకొనకపోతే ఇంకా చాల నష్టము వస్తుందని మనవి చేస్తున్నాను.

రైల్వే లైను విషయంలో మంత్రి లచ్చన్నగారు ఇవ్వాళ ప్రశ్నోత్తరాల సంద ర్భంలో నీళ్ళ నములుతూ చెప్పిన సమాధానాన్నిబట్టి చూస్తే నెల్లూరు—ఖాజీపేట line ను recommend చేసినట్లు ఖచ్చితంగా స్పష్టంగా గోచరించడంలేదు. బెజవాడ-మద్రాసు రెండో లైను వేసే దానికంటె అలాంటి line నొక దానిని నెల్లూరు—ఖాజీ పేటకు వేసినందువల్ల షుమారు 2 లక్షల ప్రజానీకానికి తప్పకుండా సహాయము జరు గుతుంది ఒకవేళ దానిని ఒక్కసారిగా వేయలేకపోయినా కొద్దిగానైనా ప్రారంభిం చితే నందికొండ ప్రారంభించే దృష్ట్యాగాని లేక హైదరాబాద్‌తో మనం కలిసిపోయే దృష్ట్యాగాని ఇది ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది. ఈ line విషయమై మన ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వానికి నచ్చచెప్పలేకపోయినందుకు విచారము కలుగుతోంది. "ఉన్నవాడు ఉన్నవాడికే పెట్టాడన్నట్లు" బెజవాడనుంచి మద్రాసుకు రెండో లైను వెయ్యకపోతేఏమి? తొందరగ బండ్లు రాకుండా ఒక అరగంట ఆలస్యమైతే ఏమంత ముంచుకుపోయింది, కొంపలు అంటుకుపోతాయా? అసలు లైనే లేనిచోట్ల ఇది వేస్తే ఏమిపోయిందనే తీవ్రమైనటువంటి విమర్శ ప్రజలలో కలుగుతోంది. అసలు ఈ విష యమై ప్రభుత్వము ఎందుకు ఆలోచించ లేకపోయిందో నాకేమాత్రం కూడా అర్థం కావడంలేదు. ఈనాడు Extension అని bridge లు అని అనేకము కడుతున్నారు కట్టవలసిందే అందుకు మాకేమి ఆక్షేపణలేదు. వెనుకబడిన వాళ్ల విషయంలో

కూడా కొంతవరకు పనులు ప్రారంభిస్తారనే విశ్వాసము కలిగించడానికిగాను ఇకమీదట నైనా ప్రభుత్వము కృషిచేయవలసిన అవసరం ఉన్నదని నేను మనవి చేస్తున్నాను. Teachers విషయం కూడా అలాగే ఉన్నది. మొన్న నేను వచ్చేటప్పుడు 20 మంది టీచర్లు వచ్చి మన కనిగిరి తాలుకాలోనే 130 దాకా తొలగింపులకు notice లు వచ్చినాయని చెప్పారు.

ఇంకొక ముఖ్యమైనటువంటి విషయం కంచెల విషయం. ఇది మునుపు మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చినపుడు కంచెల వేలం పాటలు ఉండవని చెప్పారు. అదే రకంగా రెవెన్యూ మంత్రిగారు ప్రభుత్వము యొక్క forest ఉద్యోగస్తులకు వ్రాశారు. మరల ఈ సంవత్సరము ఆర్డర్లు జారీచేసినట్లు వినికిడిగా తెలుస్తున్నది. ఈసారి ఆ విధంగా చట్ట విరుద్ధంగా మాకు బలము ఉందిగదా అని వసూలుకు పూను కొంటే వచ్చే దుష్ఫలితాలకు మేమెంత మాత్రము బాధ్యత వహించలేము. ఇదివరకే కొన్నివేల రూపాయలు వసూలు చేసుకొని ప్రభుత్వపు ఖజానాలో కట్టించుకొన్నారు. ప్రభుత్వానికి పోయిన సొమ్ము తిరిగి రాదనే ఉద్దేశ్యముతో వదులు కొన్నాము. కాని ఇప్పటికైనా ముఖ్య మంత్రిగారు దాని విషయం ఆలోచించి కంచెలు వేలము పాడడము మాన్పించాలని నేను మీ ద్వారా మనవి చేస్తున్నాను.

Mr. SPEAKER The House will now adjourn and meet again at 11 a. m. tomorrow Saturday the 11th August 1956.

The House then adjourned.

# APPENDIX

INDUSTRIES, CO-OPERATION AND LABOUR DEPARTMENT.

Vide answer to Legislative Assembly Question No 859 (Starred) by Sri GANJI NAGESWARA RAO, M.L.A.—Regarding the fixation of Minimum Wages for agricultural labourers—Approved answer and note for Supplementaries at page 215 supra.

DEPARTMENT OF INDUSTRIES, CO-OPERATION AND LABOUR.

---

## G O. Ms. No 2309, 29th December 1954

Labour—Minimum Wages Act, 1948—Minimum rates of wages for employment in agriculture—Fixed—Notification—Issued.

---

READ—the following paper —

G O. No, 1806, Development, dated 27th October 1954.

---

*Order—No. 2039, Industries, Co operation and Labour, 29th December 1954.*

The Superintendent, Andhra Government Press is requested to publish the appended notifications in English and in the languages of the State in three successive issues of *Andhra Gazette* and in the chief languages of the districts in all the District Gazettes The Senior Translator to Government is requested to supply the Superintendent, Andhra Government Press, with the requisite translations of the notifications

(By order of the Governor)

B PRASAD,
*Secretary to Government,*

To the Superintendent, Andhra Government Press, Kurnool
,, the Senior Translator to Government, Andhra, Madras.
,, the Commissioner of Labour, Andhra, Madras—4
,, the Board of Revenue, Andhra, Madras—2,
,, All Collectors
,, the Director of Agriculture and Fisheries, Andhra, Madras—2.
,, the Economic Advisor to the Government of Andhra, Kurnool.
Copy to Revenue Department.
,, Home (information and Publicity) Department.
,, Secretary to Government of India Ministry of Labour, New Delhi.
,, the Chief Commissioner of Coorg. Mercara.
,, the Director, Labour Bureau, Simla.

# APPENDIX.

## NOTIFICATIONS.

### I

In exercise of the powers conferred by section 3 (1) (*a*) and 5 (2) of the Minimum Wages Act, 1948 (Central Act XI of 1948), the Governor of Andhra hereby fixes with effect from the 30th December 1954 in respect of employees employed in agriculture in the 14 villages specified in column (1) of the Schedule below, the minimum rates of wages specified in column (3) of the said Schedule as payable to each class of agricultural operations mentioned in column (2) thereof, the same having been previously published as required by section 5 (1) (*b*) of the said Act

SCHEDULE

| Villages (1) | Agricultural operations (2) | All inclusive minimum rates of wages per day. (3) | | |
|---|---|---|---|---|
| | | Rs | A | P. |
| 1 Voguru in Kandukur Taluk, Nellore District<br>2 Gudlur in Kandukur Taluk, Nellore District<br>3 Kavali Bit II in Kavali Taluk, Nellore District<br>4 Naginenigunta in Udayagiri Taluk, Nellore District,<br>5 Chittecherla in Vayalpad Taluk Chittoor District,<br>6 Kamalla in Vayalpad Taluk, Chittoor District,<br>7 Velagalapalem in Gudem Agency Taluk, Visakhapatnam District<br>8 Budarsingi in Sompeta Taluk, Srikakulam District<br>9 Banjaruvuvarajapuram in Sompeta Taluk, Srikakulam District<br>10 Kottu in Parvatipuram Taluk, Srikakulam District<br>11 Venkatapuram in Nugur Taluk, East Godavari District<br>12 Dharmavaram in Pithapuram Taluk East Godavari District.<br>13 Arunachalapuram in Nugur Taluk, East Godavari District.<br>14 C. Kathigudem in Nugur Taluk, East Godavari District. | *I Adult Male employees* | | | |
| | Ploughing with worker's own plough team | 3 | 0 | 0 |
| | Ploughing without worker's own plough team | 1 | 8 | 0 |
| | Any other agricultural operation | 1 | 8 | 0 |
| | *II Adolescents and Women Employees.* | | | |
| | Sowing tansplanting, weeding and other subsidiary work connected with agricultural operations. | 0 | 12 | 0 |

**NOTE.**—Every minimum rate of wages specified in column (3) above is an all-inclusive rate allowing for the basic rate the cost of living allowance and the cash value of the concessions, if any.

II

In exercise of the powers conferred by section 11 (2) of the Minimum Wages Act, 1948 (Central Act XI of 1948), the Governor of Andhra hereby authorises that the minimum rates of wages fixed in agricultural operations and published in Industries, Co-operation and Labour Department Notification No 565, dated the 30th December 1954 at page 1576 of Part I of the *Andhra Gazette*, dated the 30th December 1954 may be in cash or in kind or partly in cash and partly in kind. The value of the wage payable in kind shall not be such as to make the wage paid less than the minimum wage fixed by Government and the cash value of wages in kind shall be estimated in the manner prescribed in rule 20 of the Minimum Wages (Andhra) Rules, 1954

# ANDHRA LEGISLATIVE ASSEMBLY DEBATES.

*Third Session of the Second Andhra Legislative Assembly constituted under the Constitution of India*

VOLUME VIII (Nos 1 TO 3)

TABLE OF CONTENTS

PAGES

WEDNESDAY, THE 8TH AUGUST, 1956



THURSDAY, THE 9TH AUGUST, 1956



FRIDAY, THE 10TH AUGUST, 1956

# INDEX

## A



## B



## C



## D

## G—(Contd.)



## H



## I



## J



## K



## L

## L—(Contd.)

## P—(Contd.)

## Q—(Contd.)

**QUESTIONS AND ANSWERS—(Contd.)** PAGES

## R



## S

## S—(Contd.)



## T



## V

## W



## Y